# జీవన్ హనుల అభినందనలు

## కలకాలం సాగిన క్రీడా వ్యాసంగాలు

శతాబ్దాల తరబడి క్రీడాకారులు కాలంతో కుస్తీ పట్టుతూనే ఉన్నారు. ఏకాగ్రత, రెప్పపాటులో ప్రతిక్రియ చూపడం ఏ సాము కసరత్తుల ఆటగాని నేర్పుకైనా గీటురాళ్లు. అయినా కొందరు క్రీడాకారులు వయస్సు పెరుగుతున్నా కాలానికి ఎదురు నిల్చారు, ముందు స్థాపించిన రికార్డులను అధిగమించారు.





ఒలింపిక్ పోటీదారొకరు క్రీడావ్యాసంగంలో గడిపిన అతిఎక్కువ కాలం 40 ఏళ్లు! డెన్మార్క్ దేశస్థుడైన డా. ఇవాన్ ఒస్సైయియర్ (1888-1965) కత్తిసాములో ఆ రికార్డు స్థాపించారు. ఆయన 1908, 1912, 1920, 1924, 1928, 1932, లో రికార్డు సంఖ్యలో ఆ పోటీల్లో పాల్గొన్నారు! అప్పటికాయన వయస్సు 60 ఏళ్లు.

వయస్సునెదిరించిన మరొక ఆటగాడు ఇథియోపియా దేశపు పరుగు పందెగాడు మిరట్స్ యిఫ్టర్. మరే యితర పరుగు పందెగాడూ సాధించనిదాయన సాధించారు. 5,000 మీటర్ల, 10,000 మీటర్ల పందాల్లో గెలిచినప్పుడాయన వయస్సు 36 ఏళ్లు! (వయస్సు సరిగా తెలియదట. ఇంకా ఎక్కువే ఉండొచ్చు). 1980 మాస్కో ఒలింపిక్స్‌లోని విశేషాల్లో ఇదొకటి.





షార్లట్ డోడ్ (1871-1960) జీవితమంతా ఆటల్లో గెలుపులతోనే గడిపారు. ఆమె వింబుల్డన్ సింగిల్స్‌లో 5 సార్లు గెలిచారు. బ్రిటిష్ మహిళల గోల్ఫ్ ఛాంపియన్ షిప్‌ను గెలిచారు. విలువిద్యలో ఒలింపిక్ రజత పతకం సాధించారు. ఇంగ్లాండు తరఫున హాకీ ఆటలో కూడా పాల్గొన్నారు!

సూపర్ హెవీ-వెయిట్ లిఫ్టర్లలో 10 ఏళ్లగా పై నిలిచినవారు సోవియట్ బలశాలి వాసిలీ అలెక్సియేవ్. ఆయన 80 రికార్డులను కూల దోశారు. 2 ఒలింపిక్ స్వర్ణపతకాలు సాధించారు! 1980 లో మరొక చిన్నవయస్కుడికి ఆ బిరుదు కోల్పోయారు. అయినా వదిలి పెట్టే ఉద్దేశ్యంలో లేరు!



జీవిత బీమా అనేది మీ భవిష్యత్తును కాపాడుకోవడానికి అతి క్షేమకరమైన, పదిలమైన మార్గం. దాన్నిగురించి తెలుసుకోండి.



**లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా**

వచ్చేసారి: జీవన్, హనులు నేర్పిన పత్యం
ఆరోగ్యమే మహాభాగ్యం!

daCunha-LIC-119TEL

సీతాకోకచిలకా, సీతాకోకచిలకా, రావే రావే
నన్ను చూడు, నాతోటినిచూడు, పూలని చూడవె రావే
సీతాకోకచిలకా, యిదిగో జెమ్స్ యివి నీకోసం
నీకోసం, మరి నాకోసం, మన అందరికోసం








చేజిక్కించుకోండి ఆ మధుర క్షణాల్ని
చేజిక్కించుకోండి ఆ జెమ్స్‌ని!

క్యాడ్‌బరిస్
చాక్లెట్లు

పువ్వులన్నీ సుగంధాన్ని పంచుతాయి, క్యాడ్‌బరిస్ జెమ్స్ తియ్యదనాల్ని అందిస్తాయి

OBM/6742TL

# చందమామ కేమెల్ రంగుల పోటీ

ప్రవేశ రుసుము లేదు





**బహుమతులు గెలుచుకోండి**

కేమెల్—మొదటి బహుమతి రు. 15
కేమెల్—2వ బహుమతి రు. 10
కేమెల్—3వ బహుమతి రు. 5
కేమెల్—5 కన్సొలేషన్ బహుమతులు
కేమెల్—10 సర్టిఫికెట్లు



— చుక్కలు పెట్టిన గీత వెంట కత్తిరించండి. —

12 సంవత్సరముల లోపల వయస్సు గల్గిన విద్యార్థులు మాత్రమే పాల్గొన గలరు. పై చిత్రాన్ని ఏ కేమెల్ రంగుతోనైనా రంగు వేయండి. రంగు వేసిన ప్రవేశ పత్రాలను ఈ క్రింది అడ్రసుకు పంపండి.

P.B. No. 9928, COLABA, Bombay-400 005.

ఫలితములు తుది నిశ్చయముగాను, ఉత్తర ప్రత్యుత్తరములు అనుమతించబడవు.

Name ______________________ Age __________

Address ________________________________

దయచేసి మీ పేరు, చిరునామా, ఇంగ్లీషులోనే వ్రాయండి.

VISION

**CONTEST NO 22**

బొమ్మకు పూర్తిగా రంగులు వేయాలన్నది గుర్తుంచుకోండి.

ఎంట్రీలు పంపుటకు ఆఖరు తేదీ. *30-11-1981*

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ ["నటుడిప్రభావం"]కు ఆధారం "వసుంధర" రచన. "తోకచుక్క" ముగిసింది. ఈ సంచికలో, "మకరదేవత" ప్రారంభమయింది. ఇది తోకచుక్కలోని సంఘటనల తర్వాత కథ. అందులోని కొన్ని పాత్రలు, ఇందులో దర్శనమిస్తాయి. కాని కథ దేనికదే.

## అమరవాణి

శతేషు జాయతే శూరః, సహస్రేషు చ పండితః,
వక్తా దశసహస్రేషు, దాతా భవతి వా న వా.

[శూరుడు నూటికిఒక్కడూ, పండితుడు వేయిమందికీ, మాట నేర్పరి పదివేలమందికీ ఒక్కడు వుండవచ్చు. కాని, దాత పది వేలమందిలో ఒక్కడైనా వుండవచ్చుని రుజువుపరచడం కష్టం.]

సంపుటి 69 నవంబర్ '81 సంచిక 5

విడి ప్రతి : 1–75 : : సంవత్సర చందా : 21-00




CHITRA



# రాయబారి సమయస్ఫూర్తి

మద్రదేశాన్ని ఏలే ప్రచండమహారాజు గొప్ప సైనికబలం, సాధనసంపత్తీ కల వాడు. ఆయన ఇరుగు, పొరుగు రాజ్యాలతో స్నేహసంబంధాలు కొనసాగేందుకు, రాయబారులను నియమించేవాడు.

ఆయన కౌశాంబి, విదేహరాజ్యాలు రెంటికీ వజ్రసేను డనే అతణ్ణి చాలా కాలం క్రితం రాయబారిగా నియమించాడు. అతడు ఎంతో కాలం సమర్థవంతంగా ఆ పదవిని నిర్వహించి, హఠాత్తుగా మరణించాడు.

రాజు ప్రచండుడు, ఆ దేశాలకు మరొక రాయబారిని నియమించదలచి, అందుకు అర్హులైన వారి కోసం కొన్ని పరీక్షలు నిర్వహించాడు. ఆ పరీక్షలలో వికారుడు, లలితుడు అనేవారు ఉత్తీర్ణులయారు.

ఈ యిద్దరిలో ఎవరు రాయబారి పదవికి అర్హులో నిర్ణయించదలచి, రాజు వారికి ఒక పరీక్ష పెట్టాడు. ఆయన ఆ ఇద్దరితో ''మీపైన చాలా ముఖ్యమైన బాధ్యత మోపుతున్నాను,'' అని చెప్పి, వికారుడితో, ''నువ్వు, ఈ రోజునే బయలుదేరి కౌశాంబీరాజ్యానికి వెళ్ళి, ఆ రాజుతో స్నేహసంధి ఒప్పందం కుదుర్చుకుని, మనం యిచ్చే కానుకలు ఆయనకు సమర్పించి రావాలి. ఇందుకు అవసరం అయిన పరివారం నీ వెంట పంపబడుతుంది,'' అన్నాడు.

ఇదే విధంగా లలితుడు విదేహ రాజ్యానికి పోయి, ఆ రాజుకు కానుకలు సమర్పించి, స్నేహసంధి చేసుకుని రావలసి వున్నది.

వికారుడు కానుకలతోనూ, పరివార జనంతోనూ కౌశాంబికి బయలుదేరాడు. లలితుడు విదేహరాజ్యానికి ప్రయాణమయాడు. వాళ్ళిద్దరూ ఎంత కాలంలో

బొమ్మిడి అచ్చారావు

తిరిగి రావలసిందీ రాజు వాళ్ళకు తెలియ బరిచాడు.

లలితుడు నిర్ణయించబడిన గడువుకు ముందుగానే వెంట తీసుకుపోయిన కానుకలతో, పరివారజనంతో తిరిగి వచ్చి, రాజును చూడబోయాడు.

"మన కానుకలు విదేహ రాజు నిరాకరించాడా? అతడితో సంధి పొసగ లేదా?" అని అడిగాడు రాజు ప్రచండుడు.

"మహారాజా, సామంతరాజుతో స్నేహ సంధి ఏమిటి? అలాంటిది మన సార్వ భౌమత్వాన్ని కించపరుచుకోవడం అవుతుంది గదా. కానుకలు తీసుకు వెళ్ళేప్పుడు ఆ సంగతి నేనెరగను. విదేహ రాజును కలుసుకున్నాక, ఆ సంగతి నేను గ్రహించాను. అందువల్ల ఆయనకు కానుక లివ్వకుండా, స్నేహసంధి విషయం ప్రస్తావించకుండా, తిరిగి వచ్చే శాను," అన్నాడు లలితుడు.

ఆ జవాబుకు రాజు ఆశ్చర్యపడలేదు గాని, సభలో వున్న వారందరూ ఎక్కడ లేని ఆశ్చర్యం చెందారు. మహారాజు స్నేహసంధి చేసుకురమ్మంటే, అందుకు భిన్నంగా ప్రవర్తించిన లలితుడు రాయ బారి పదవికి అనర్హుడని రాజు నిర్ణయిస్తా డనుకున్నారు.

రాజు పెట్టిన గడువుకు రెండు రోజులు ఆలస్యంగా, కౌశాంబీ రాజు యిచ్చిన కానుకలతో వికారుడు తిరిగి వచ్చాడు.



ఆ సమయంలో సభ తీరివున్న రాజు, వికారుణ్ణి, "గడువు దాటి కొంత ఆలశ్యంగా వచ్చావు. కౌశాంబీ రాజు మనతో స్నేహసంధికి ఒప్పుకున్నట్టే గదా?" అని అడిగాడు.

వికారుడు విజయగర్వంతో ఉప్పొంగిపోతూ, "నా వాగ్ధాటితో కౌశాంబీ రాజును ఉక్కిరిబిక్కిరి చేశాను, మహారాజా! మనతో స్నేహసంధికి అతణ్ణి ఒప్పించాను. ఇందుకు గుర్తుగా ఆయన మన కానుకలు స్వీకరించి, విలువైన కానుకలు మనకు యివ్వడమే గాక కొంతమంది దాసదాసీలను కూడా బహూకృతిగా పంపాడు. ఈనాటివరకూ తనకు అతిథిగా వుండవలసిందని, నన్ను బలవంత పెట్టాడు," అన్నాడు.

సభికులంతా వికారుణ్ణి అభినందించబోయేంతలో రాజు వారిని వారించి, "రాయబారిగా లలితుణ్ణి నియమిస్తున్నాను! ఇది, మీలో చాలా మందికి ఆశ్చర్యం కలిగించవచ్చు. కాని, లలితుడు చేసినదే సక్రమమైనది. విదేహ మనకు సామంతరాజ్యం. అలాంటిదానితో స్నేహ సంధి చేసుకోవలసిన అగత్యం లేదు. ముందుగా యీ సంగతి తెలియకపోయినా, లలితుడు ఆ రాజ్యం చేరాక, విషయం తెలుసుకుని, ఆ రాజుకు కానుకలివ్వకుండా తిరిగి వచ్చాడు.

"కౌశాంబీ కూడా మనకు సామంతరాజ్యమే. వికారుడు యీ నిజం తెలుసుకునేందుకు ఎట్టి ప్రయత్నమూ చేయకపోగా, తొందరపడి ఆ రాజుకు కానుకలు సమర్పించి, అర్థం లేని స్నేహసంధి చేసుకువచ్చాడు. రాయబారికి అవసరం అయిన సమయస్ఫూర్తి అతడికి లేదు. అలాంటివాడి చేతిలో మద్రదేశ గౌరవం కాపాడబడుతుందని నమ్మడం కష్టం," అన్నాడు.

సభలో వున్నవారందరికీ లలితుడు ఎంత గొప్ప వివేకవంతుడో తెలియడంతో పాటు, వికారుడు చేసిన పొరబాటు కూడా అర్థమయింది.







# అసూయాపరులు

కుంతలదేశపు రాజు రవివర్మ ఆస్థానంలో కోశాధికారి పదవికి ఖాళీ ఏర్పడింది. దానికి తగిన వాడి కోసం రాజు ప్రయత్నిస్తున్న సమయంలో రాణి తన తమ్ముడి సంగతి చెప్పి, ''డబ్బుతో కూడిన వ్యవహారం గదా? పరాయి వాళ్ళకన్న, మన వాడే అయితే ఎంతో నమ్మకంగా పని జరిగిపోతుంది,'' అన్నది.

రాజుకు యిది యిష్టం లేదు. రేపు ధనాగారంలో వుండవలసిన డబ్బు విషయంలో ఏవైనా హెచ్చుతగ్గులు వస్తే, బావమరిదితో విరోధపడవలసి వస్తుంది. రాజు యిలా ఆలోచించి భార్యతో, ''చూద్దాంలే!'' అని వూరుకున్నాడు.

ఆ మర్నాడు సేనాధిపతి రాజును కలుసుకుని, ''మహారాజా, మా తమ్ముడు బాగా చదువుకున్నవాడు, కాని వాడికి యుద్ధ విద్యలేవీ అలవడలేదు. మీరు అతడికి కోశాధికారి పదవి ఇస్తే, సేనానిగా నేనూ, కోశాధికారిగా వాడూ తమకు సేవ చేసే భాగ్యం కలుగుతుంది,'' అన్నాడు.

రాజుకు యిదీ యిష్టం లేదు. అన్న సేనానీ, తమ్ముడు కోశాధిపతీ అయి కూర్చుంటే, యిక ఆస్థానంలో వాళ్ళకు పట్టపగ్గాలుండవు. పైగా సైన్యాన్నీ, ధనాన్నీ యిద్దరు సోదరుల పరం చేసినట్టవుతుంది!

ఈ దశలో విష్ణుశర్మ అనే యువకుడు రాజదర్శనం చేసుకుని, ''మహారాజా, నేను గణితశాస్త్రంలో చెప్పుకోదగినంత ప్రావీణ్యం సంపాయించాను. తమరు నన్ను పరీక్షించి, కొలువులో ఏదైనా ఉద్యోగం యిప్పించండి,'' అని అడిగాడు.

రాజు రవివర్మ, విష్ణుశర్మను అనేక విధాలుగా పరీక్ష చేసి తృప్తి చెంది అతణ్ణి కోశాధికారిగా నియమించాడు.

పెంటకోట సోమినాయుడు

ఈ నియామకం రాణీకీ, సేనానాయకుడికీ చాలా కోపకారణం అయింది. కొద్ది కాలం జరిగాక రాణి ఒకరోజున రాజుతో, "ఈ విష్ణుశర్మ మహా తెలివైనవాడనీ, నమ్మకస్థుడనీ గదా మీరు కోశాధికారి పదవి యిచ్చారు. అతడు ఒట్టి లంచగొండి. ఇంతకుముందే ఉద్యోగం కోసం వచ్చిన ఒకరి నుంచి వెయ్యి వరహాలు లంచం పుచ్చుకున్నట్టు, నాకు నమ్మకంగా తెలిసింది. అతను ఇంటికి వెళ్ళేప్పుడు అ డబ్బు పట్టుకుపోతాడు. ఆలశ్యం జరక్కుండా ఇప్పుడే మీరు పరీక్ష చేశారంటే కోశాగారంలో వుండవలసిన దానికన్న, వెయ్యి వరహాల ధనం అధికంగా వుంటుంది," అన్నది.

రాజు, అప్పటికప్పుడే కోశాగారానికి పోయి ధనం లెక్కపెట్టించి చూస్తే, ఉండవలసినదానికన్న ఒక్క పైసా కూడా అధికంగా లేదు. విష్ణుశర్మ దగ్గిర వెతికించినా, దాచిన ధనం ఏమీ కనబడలేదు.

రాజు సంతృప్తి చెంది, యీ జరిగిన దానికి కారణం తరవాత చెబుతానని, ఆశ్చర్యపోయి చూస్తున్న విష్ణుశర్మకు చెప్పి, అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

చెలికత్తెల ద్వారా సంగతి విన్న రాణికి ఒక విషయం అర్థం కాలేదు. ఆమె తనకు బాగా నమ్మకమైన చెలికత్తె ద్వారా, కోశాగారంలో వెయ్యి వరహాల మూట పడవేయించింది. అది, ఏమైపోయినట్టు ?

సేనాధిపతికూడా తీరని అనుమానం ఒకటి కలిగింది. అతడు ఎంతో నమ్మకస్థుడైన నౌకరు ద్వారా కోశాగారం నుంచి వెయ్యి వరహాల మూట దొంగిలించాడు. అయినా, అక్కడ వుండవలసిన ధనంలో తేడా రాలేదు. ఎందువల్ల ?

ఈ విధంగా యిద్దరు అసూయాపరులు, ఒక నీతివంతుణ్ణి సాధించబోయి, తమ దుష్టపథకాలు బెడిసికొట్టగా, కన్నంలో తేలు కుట్టిన దొంగల్లా, కిమ్మనకుండా ఊరుకున్నారు.






మరాళద్వీపానికి రాజైన మందరదేవుడు, ఒకనాడు ఉద్యానవనంలో విహరిస్తూండగా, కోటద్వారం వద్ద పెద్ద కలకలం బయలుదేరింది. ప్రజల కేకలూ, సైనికుల హెచ్చరికలతో కోట ప్రాంతమంతా మారుమోగసాగింది. కారణమేమిటా అని, మందరదేవుడు ఉద్యానవనం నుంచి కోట ద్వారంకేసి బయలుదేరాడు.

కొద్దిసేపటిలో మందరదేవుడు కోట ద్వారాన్ని సమీపించేసరికి, మంత్రి ప్రజలను శాంతంగా వుండమని హెచ్చరించడం అతడి కంటబడింది. రాజు రాక గమనించిన కొందరు సైనికులు, ఆ సంగతి మంత్రితో చెప్పారు. వెంటనే మంత్రి వెనుదిరిగి రాజును సమీపించాడు.

“ఏమిటీ కలకలం?” అని ప్రశ్నించాడు మందరదేవుడు.

మంత్రి క్షణకాలం కోటద్వారంకేసి చూసి, “ప్రభూ, నిజమో అబద్ధమో యింకా ధృవపడలేదు. నా వరకు నేను యిందులో కొంత నిజం వుండవచ్చునని భావిస్తున్నాను. కుండలినీ ద్వీపం యీ మధ్య అరాజక స్థితిలో వున్నదని, మన అందరికీ తెలిసినదే. పోతే, యిప్పుడు వచ్చిన వార్త ఏమిటంటే, ఆ ద్వీప రాజ్యాధికారాన్ని నరవాహనమిశ్రుడనే సేనాని హస్తగతం చేసుకుని, మన రాజ్యం మీదికి దాడి బయలుదేరాడని. ఇది చేపలు పట్టబోయిన జాలరులు తెచ్చిన వార్త. ప్రజలు కలవర పడుతున్నారు.




శాంతంగా వుండవలసిందని హెచ్చరిక చేశాను,'' అన్నాడు.

మందరదేవుడు తల పంకించి వూరుకున్నాడు. మంత్రి భావించినట్టు, ఇందులో కొంత సత్యం వుండవచ్చునని అతడికీ తోచింది. రాజు మౌనం వహించడంతో, ఆయనా ప్రమాదాన్ని శంకిస్తున్నాడని గ్రహించిన మంత్రి, ''ప్రభూ, ముందు జాగ్రత్త కోసం తగు ఏర్పాట్లు చేయవలసిందిగా, సేనానికి కబురు పంపాను. ఈ వార్తలోని నిజానిజాలు సూర్యాస్తమయం లోపల మన వేగుల ద్వారా తెలుసుకోవచ్చు. వారు వచ్చేవేళ అయింది,'' అన్నాడు.

మందరదేవుడు మంత్రి కేసి ప్రశ్నార్థకంగా చూసి, క్షణం ఆగి, ''సరే, ఆ వార్తలోని నిజానిజాలు తెలియగానే, నాకు వెంటనే తెలియచెయ్యండి. మీ కోసం చూస్తూంటాను.'' అంటూ భవనంవైపుకు సాగిపోయాడు.

రాజు వెళ్ళగానే మంత్రి సరాసరి పోయి కోట బురుజు ఎక్కాడు. అక్కడ నిలబడి చూస్తే, దూరంగావున్న సముద్రం, అందులో తేలియాడుతూన్న నావలూ కనబడతై. మంత్రి ఆశించిన విధంగానే, దూరాన తెరచాప ఎత్తిన ఒక నావ కనిపించింది. అది సూటిగా మరాళద్వీపానికేసి వస్తున్న సూచనగా, క్షణక్షణానికీ మరింత స్పష్టంగా కనిపించసాగింది.

ఇక సేనాని మంత్రి నుంచి వార్త రాగానే, ముందు జాగ్రత్త కోసం సైనికులను సమీకరించాడు. చుట్టూ సముద్రం చేత ఆవరింపబడివున్న మరాళద్వీపానికి, అప్పుడప్పుడూ చేరువలో వున్న ద్వీప రాజ్యాల నుంచి ప్రమాదం సంభవిస్తూండేది. ఆ కారణంవల్ల మరాళద్వీపం లోని ప్రతి పురుషుడూ, అంతో యింతో సైనిక శిక్షణ పొందడం రాజశాసనంగా వుండేది.

సేనాని కొందరు సైనికులతో సముద్ర తీరానికి బయలుదేరాడు. మరాళద్వీప నావికాదళం కూడా అవసరమైతే శత్రు

నావలతో యుద్ధానికి తలపడేందుకు సిద్ధమౌతున్నది. శంఖనాదాల ద్వారా, చాటింపుల ద్వారా ప్రతి నావికుడూ సముద్ర తీరాన వున్న తమ, తమ నావలకు రావలసిందిగా ఆజ్ఞాపించబడ్డాడు.

కోట బురుజు పైన వుండి, యీ సన్నాహాలను చూస్తున్న మంత్రి, సేనానుల జాగ్రత్తకూ, విధి నిర్వహణలో వారు చూపుతూన్న శ్రద్ధకూ చాలా ఆనందపడ్డాడు. కాని, మంత్రి పొందిన ఆనందం, అంతలోనే ఆదుర్దాగా పరిణమించింది. వేగులు వస్తున్న నావకు వెనకగా కొంత దూరంలో, హఠాత్తుగా నల్లని మేఘాలు కమ్మినట్టయింది. ఇది తుఫాను సూచనేమో అని మంత్రి పరికించి చూసేటంతలో, అవి మేఘాలు కావనీ, కొన్ని యుద్ధనావలు గుంపుగా మరాళద్వీపం కేసి రావడమనీ అతడు గ్రహించాడు. ఆ మరుక్షణంలోనే, ఆ యుద్ధ నావల నుంచి నల్లని పొగలు బయలుదేరినై. కొద్దిసేపటికల్లా నూనె గుడ్డలు చుట్టి నిప్పంటించడంవల్ల మండుతూన్న కొన్ని బాణాలు, వేగులు వస్తున్న నావ మీదికి రాసాగినై.

జాలరులు తెచ్చిన వార్తలు నిజమని, అప్పటికి మంత్రి అర్థం చేసుకున్నాడు. ముందు ఏ హెచ్చరికా ఇవ్వకుండా, యుద్ధ ప్రకటన కూడా చెయ్యకుండా, పరదేశాల మీద దాడిచేసే కొత్త సంప్రదాయాన్ని, కుండలినీ రాజరికాన్ని హస్తగతం చేసు





ఉన్న నరవాహనమిశ్రుడు ప్రారంభించాడని, మంత్రి పళ్ళు కొరికాడు. ఒకటి, రెండు వందల సంవత్సరాల కిందటి శాక్తేయుడనే మాంత్రికుడు యీ విధంగా, యుద్ధప్రకటన చేయకుండానే చాలా ద్వీపరాజ్యాలను దోచుకున్నాడు. అతడు రాజవంశీయుడు కాడనీ, మాంత్రికుడు గనక, అలా అధర్మంగా ప్రవర్తించాడని, అప్పట్లో చాలామంది సరిపెట్టుకున్నారు.

మంత్రి యిలాంటి ఆలోచనలలో వుండగా, మరాళద్వీప నావికా సైన్యం, తమ నావకు రానున్న ప్రమాదాన్ని గ్రహించి ముందుకు ఉరికింది. సైనికులు సింహనాదాలు చేస్తూ, నావలను ముందుకు నడిపించారు. కొద్ది సేపట్లో సముద్ర తీరానికి నాలుగైదు కోసుల లోపల కుండలినీ—మరాళద్వీప నావికా దళాలు యుద్ధానికి తలపడినై.

ఇంతలో సైనికులు కోట బురుజుపైకి రాసాగారు. ఒకవేళ మరాళద్వీప నావికా దళం ఓడించబడితే, పట్టణాన్ని రక్షించేందుకు ముందు జాగ్రతగా సైనికులు అక్కడికి పంపబడ్డారు.

మంత్రి ఆ సైనికులలో ఒకడిని పిలిచి, యుద్ధ వార్తలు రాజుకు చెప్పేందుకు పంపాడు.

ఈ లోపల సముద్రంలో నావికా యుద్ధం ముమ్మరంగా సాగుతున్నది. ఇరుపక్షాల నావికులూ ప్రాణాలకు తెగించి పోరాడసాగారు. నూనెలో ముంచిన గుడ్డలను బాణాలకు చుట్టి, నిప్పంటించి ఒకరి నావల మీదికి ఒకరు విసురుకోసాగారు. మంటలు లేచిన నావల నుంచి సైనికులు సముద్రంలోకి దూకుతూంటే, మండుతున్న నావలలోని మంటలను ఆర్పి, వాటిని వశపరుచుకునేటందుకు, ఎదిరి పక్షపు సైనికులు వాటిని ఎక్కుతున్నారు.

కోట బురుజుమీది నుంచి యిదంతా చూస్తున్న మంత్రికి, యిప్పుడు జరుగుతున్న నావికా యుద్ధ పర్యవసానం తన



"ఏం జరిగింది? ఎందుకలా పరిగెత్తుకుంటూ వచ్చావు?" అని మంత్రి సైనికుణ్ణి ఆదుర్దాగా ప్రశ్నించాడు.

"రాజుగారు ఎక్కడ వున్నదీ తెలియడం లేదు," అంటూ సైనికుడు తడబడుతూ జవాబిచ్చాడు.

"ఆ సంగతి నీకెలా తెలిసింది?" అని అడిగాడు మంత్రి.

"అయ్యా, నే వెళ్ళేసరికే రాజభవనం అంతా గందరగోళంగా వున్నది. కొద్ది నిమిషాల కిందట, రాజుగారు వారి గదిలో నుంచి సహాయానికై కేకలు వేయడం, ఒకరిద్దరు దాసీలు విన్నామని చెబుతున్నారు. భటులు ఆయన కోసం భవనమంతా వెతికారు. ఆయన జాడ లేదు. రాజుగారి అంగరక్షకులు యిద్దరు కూడా కనిపించడంలేదు," అన్నాడు సైనికుడు.

అంగరక్షకులు కనిపించడం లేదనే సరికి, మంత్రికి ఏదో ద్రోహం జరిగిందన్న అనుమానం కలిగింది. బహుశా, యిది కుండలినీద్వీప రాజ్యాన్ని చేజిక్కించుకున్న నరవాహనమిశ్రుడి కొత్త రాజనీతి ప్రభావం కావచ్చు ననుకున్నాడు. రాజు భవనంలో లేడనేది, ఆయన కోసం వెతికిన భటులు చెబుతున్నారు గనక, ఆయనను బంధించిన వారెవరైనా, ఈసరికి రాజును కోట గోడల అవలికి

రాజ్యానికి అనుకూలంగా పరిణమిస్తుందన్న నమ్మకం సన్నగిల్లసాగింది. అతడికున్న ఒక ఆశా తాను పంపిన వేగులతో వున్న నావ సురక్షితంగా తీరం చేరాలని. అప్పుడుగాని తనకు కుండలినీ రాజ్యంలో జరిగిన మార్పులూ, నరవాహనమిశ్రుడి సంగతీ, ఆ రాజ్య ప్రజల ప్రస్తుత మనస్థితీ అర్థం కాదు.

ఇంతలో మంత్రికి వెనక అడుగుల చప్పుడు వినబడింది. అతడు తల తిప్పి చూసేసరికి, రాజుకు యుద్ధవార్త తెలియపరిచేందుకు పంపబడిన సైనికుడు రొప్పుతూ, రోజుతూ అతడి దగ్గిరకు వచ్చాడు.

తీసుకుపోయి వుండవచ్చునన్న అనుమానం కూడా మంత్రికి కలిగింది.

ఇలాంటి అనుమానం కలగడమే తడవుగా మంత్రి కొందరు సైనికులను తీసుకుని, కోటపై గల ఒక బురుజు నుంచి, మరొక బురుజుకు పరిగెత్తుతూ, వెలపలనున్న అగడ్త కేసి చూడసాగాడు. ఒకచోట కోట గోడ నుంచి వేళ్ళాడుతున్న తాడూ, దాన్ని పట్టుకుని కిందకు దిగుతున్న ముగ్గురు మనుషులూ ఆయన కంట బడ్డారు.

ఆ వెంటనే మంత్రి వెంట వున్న సైనికులు, "అరుగో, మహారాజూ, ఆయన అంగరక్షకులూ!" అంటూ కేకలు వేశారు.

ఇప్పుడేం చేయాలి? మంత్రికి పెద్ద గడ్డు సమస్య ఎదురైంది. కోట గోడనున్న మేకు నుంచి వేళ్ళాడుతున్న తాడును ఛేదించవచ్చు. కాని, అలా చేస్తే రాజూ, ఆయనను నిర్బంధించి తీసుకుపోతున్న ద్రోహులైన అంగరక్షకులూ అగడ్తలో పడిపోతారు. అలాకాక, చూస్తూ వూరుకుంటే, వాళ్ళు రాజును బంధించి నిరాటంకంగా శత్రురాజ్యానికి తీసుకుపోగలరు.

మంత్రి యిలాంటి సంశయాలతో కొట్టుమిట్టాడుతుండగా, ఒక సైనికుడు, "అయ్యా, అటు చూడండి! అగడ్త



ఒడ్డునే మూడు గుర్రాలు సిద్ధంగా వున్నవి," అంటూ కేక పెట్టాడు.

మంత్రి అటుకేసి చూసేసరికి జీనులు కట్టి వున్న మూడు గుర్రాలు కనిపించినై. సమయం చూసి రాజును బంధించి తెచ్చేందుకు నరవాహనమిశ్రుడు రాజ భవనంలో తన బంట్లను ప్రవేశపెట్టగలిగాడని, మంత్రికి అర్థమైంది. ఆయన సముద్రం కేసి చూశాడు. వేగులు వున్న నావ తీరాన్ని సమీపిస్తున్నది. కుండలినీ యుద్ధ నావలు కూడా రెండు తీరం వైపుకు వస్తున్నవి.

పరిస్థితి విషమంగా వున్నదని గ్రహించిన మంత్రి, సైనికులకేసి తిరిగి, "మీలో

నలుగురైదుగురు గుర్రాలెక్కి, రాజుగారి రక్షణకు వెళ్ళండి. ఈ దుర్ఘటనను గురించి మాత్రం మీరు కోట బయట వున్న ప్రజలతో అనకండి. వెంటనే బయలుదేరండి,'' అని ఆజ్ఞాపించాడు.

సైనికులు కోట బురుజుపై నుంచి కిందికి పరిగెత్తారు. మంత్రి దిగువనున్న అగడ్తకేసి చూశాడు. అప్పటికి రాజును ద్రోహులైన అంగరక్షకులిద్దరూ, అగడ్త దాటించి గుర్రాలు వున్న చోటుకు నడిపిస్తున్నారు. రాజు ముందు నడుస్తూండగా, వాళ్ళిద్దరూ కత్తులు చేతబట్టి, ఆయన వెనకగా పోతున్నారు. కొద్దిసేపట్లో వాళ్లు, రాజును ఒక గుర్రం ఎక్కించి, అది ముందుకు కదలగానే, దానికి వెనక తమ గుర్రాలను పరిగెత్తించసాగారు. వాళ్ళు, రాజును సముద్ర తీరంకేసి తీసుకుపోతున్నట్టు మంత్రి గ్రహించాడు.

ఇక రాజు రక్షణకై బయలుదేరిన సైనికులు నలుగురూ, గుర్రాలెక్కి కోట ద్వారం నుంచి బయటపడి కొద్దిసేపట్లో, రాజును బంధించి తీసుకు పోతున్న ద్రోహులకేసి తమ గుర్రాలను పరిగెత్తించసాగారు. గిట్టల చప్పుడు విని వెనుదిరిగి చూసిన ద్రోహులిద్దరూ, తమను సైనికులు వెంబడిస్తున్నారని గ్రహించి, రాజు వీపుకు తమ కత్తులను గురి చేసి, ఆయనను వేగంగా గుర్రాన్ని పరిగెత్తించవలసిందని ఆజ్ఞాపించారు.

కోట బురుజుపై నుంచి యిదంతా గమనిస్తున్న మంత్రి, ఒకమారు బంధితుడైన రాజు కేసీ, మరో మారు తీరాన్ని సమీపిస్తున్న శత్రునావకేసి చూస్తూ, ''మరాళ దేవీ! నీ భక్తులను కఠిన పరీక్షకు గురి చేస్తున్నావా?'' అంటూ గుండెల మీద చేతులు పెట్టుకుని, ఆకాశంకేసి తల ఎత్తాడు.

మరుక్షణంలోనే ప్రళయభయంకరమైన ఫెళఫెళారావాలతో ఉరుములూ, మెరుపులూ ప్రారంభమై, మరాళ ద్వీపాన్ని దద్దరిల్ల చేసినై. మంత్రి నివ్వెరపోయాడు. —(ఇంకా వుంది)






# నటుడి ప్రభావం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి, భుజాన వేసుకుని ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, కొందరు మనుషులు తాము ఎన్నుకున్న జీవిత మార్గంలో గొప్ప సంపదా, పేరు ప్రతిష్ఠలూ గడించి కూడా, హఠాత్తుగా వాటినన్నిటినీ త్యజించి, అజ్ఞాతవాసంలోకి వెళ్ళిపోతారు. ఇందుకు ఉదాహరణగా నీకు, కృష్ణకాంతు డనే ఒక గొప్ప నటుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ యిలా చెప్పసాగాడు:

పుష్పకదేశానికి రాజైన పుష్పనందుడు ప్రజాకంటకంగా రాజ్యపాలన చేశాడు. అప్పుడు గజేంద్రు డనే యువకుడు ప్రజల నందరినీ కూడగట్టుకుని పుష్పనందుణ్ణి రాజ్యభ్రష్టుణ్ణి చేశాడు. పుష్పకదేశాన్ని

## బేతాళ కథలు




యిప్పుడు గజేంద్రుడి సంతతి వాళ్ళు ఏలుతున్నారు. గజేంద్రుణ్ణి గురించి ఎందరో కవులు కథలూ, కావ్యాలూ రాశారు.

పుష్పకదేశంలో కృష్ణకాంతుడనే గొప్ప నటుడుండేవాడు. అతణ్ణి, గజేంద్రుడి అద్భుత సాహస గాథ ఆకర్షించింది. అతడు స్వయంగా ఒక నాటకం రాసి, కొంతమంది యువకులకు శిక్షణ యిచ్చి, ఊరూరా తిరిగి ప్రదర్శన లివ్వసాగాడు. గజేంద్రుడి పాత్రను అతడే ధరించేవాడు. ఆ నాటక ప్రదర్శనలను జనం విరగబడి చూసేవారు. కృష్ణకాంతుడి కారణంగా, అనాటి గజేంద్రుడి శౌర్య ప్రతాపాలనూ, దేశభక్తినీ, త్యాగశీలతనూ తెలుసుకోగలిగామని ప్రజలు అనుకునేవారు.

కృష్ణకాంతుణ్ణి గురించి అప్పటి పుష్పకదేశపు రాజు నరేంద్రుడికి తెలిసింది. ఆయన అతణ్ణి, తన ఆస్థానానికి పిలిపించి, నాటక ప్రదర్శన చూసి, చాలా సంతోషించాడు. కృష్ణకాంతుడికి ఘనమైన కానుకలివ్వడమే గాక, రాజు అతణ్ణి తన ఆస్థాన ముఖ్య నటుడుగా నియమించాడు. కృష్ణకాంతుడు రాజాస్థానంలో వుంటున్నా, సంవత్సరంలో ఆరు నెలల పాటు దేశాటన చేస్తూ, నాటక ప్రదర్శనలిస్తూండేవాడు.

కృష్ణకాంతుడు ఒక గ్రామంలో ప్రదర్శన యిచ్చాడు. అది అయిపోయాక ఒక యువతి అతణ్ణి చూడవచ్చి, పక్కనే వున్న మరొక యువతిని చూపిస్తూ, "నీ నటన అద్భుతం! నిన్ను నా చెల్లెలు వివాహమాడాలనుకుంటున్నది. రేపు నువ్వొక్కడివే మా ఊరు వచ్చి, మా తల్లిదండ్రులతో మాట్లాడవలసిందిగా కోరుతున్నాను," అన్నది.

ఆమె తన ఊరు పేరూ, తల్లిదండ్రుల పేర్లూ చెప్పి, తన చెల్లెలి పేరు మాలతి అని తెలియపరిచింది.

మాలతి అత్యంత సౌందర్యవతి కావడంతో కృష్ణకాంతుడు యీ ఆహ్వానానికి

చాలా సంతోషించాడు. మర్నాడు మాలతి వాళ్ళ ఊరు బయలుదేరాడు. అది ఒక అడవి దారి. కృష్ణకాంతుడి నాటకం చూడ వచ్చిన వాళ్ళు చాలామంది, యీ ప్రయాణంలో వెంట వున్నారు.

మాలతి తల్లిదండ్రులు కృష్ణకాంతుణ్ణి ఎంతగానో ఆదరించి, "నువ్వు అల్లుడు కావడం, మా కిష్టమే! కాని, నువ్వు నాటకాలు మానేసి, మా ఇంటనే వుండిపోవాలి," అన్నారు.

మాలతి తల్లిదండ్రులు గొప్ప ఆస్తిపరులు. వాళ్ళకు వ్యవసాయంతో పాటు, కొన్ని వర్తక వ్యాపారాలు కూడా వున్నవి. అల్లుడు ఇంటి పట్టున వుండి, పనులు చూసుకోవాలని వాళ్ళ ఆలోచన.

కృష్ణకాంతుడు మాలతిని, "నేను ప్రఖ్యాతి గాంచిన నటుణ్ణి నా కళను వృథాగా పోనివ్వడం యిష్టం లేదు. నీ తల్లిదండ్రులకు నేను నాటకాలాడడం యిష్టం లేదు. మరి, నీ అభిప్రాయం ఏమిటి?" అని అడిగాడు.

కృష్ణకాంతుడు నాటకాలాడడం తనకూ ఇష్టం లేదని, మాలతి చెప్పింది.

వారం రోజుల తరవాత మళ్ళీ వస్తానని కృష్ణకాంతుడు తిరుగు ప్రయాణమయ్యాడు. ఈసారి అతడిది ఒంటరి ప్రయాణం. అడవి మార్గంలో అతణ్ణి,



నలుగురు బందిపోటు దొంగలు అటకాయించారు. కృష్ణకాంతుడు మేలైన జరీ వస్త్రాలు ధరించి వున్నాడు. చేతికి బంగారు మురుగులున్నాయి. మెడలో పులిగోరు పతకమున్నది. దొంగలను చూస్తూనే అతడు గుటకలు మింగసాగాడు.

"త్వరగా, ఆ గొలుసూ, మురుగులూ, ఉంగరాలూ యిచ్చెయ్యి. ఒంటి మీది జరీ బట్టలు కూడా!" అంటూ దొంగలు చురకత్తులు ఎత్తారు.

ఆ సమయంలో అక్కడికి హఠాత్తుగా ఒక యువకుడు వచ్చాడు. అతడి చేతిలో ఎలాంటి ఆయుధమూలేదు. అతడు జబ్బ



కట్టడం లక్ష్యంగా పెట్టుకున్నాను,'' అన్నాడు యువకుడు.

''సమయానికిక్కడికి ఎలా వచ్చావు?'' అని అడిగాడు కృష్ణకాంతుడు.

''పక్క గ్రామంలో మహానటుడు కృష్ణకాంతుడున్నాడని తెలిసింది. ఆయన దర్శనం కోసం ఎంతో కాలంగా ప్రయత్నిస్తున్నాను,'' అన్నాడు ఏకాగ్రుడు.

తనే కృష్ణకాంతుణ్ణని చెప్పాలనుకున్నా, కొంచెంసేపు యువకుణ్ణి ఆటపట్టిద్దామనుకుని, ''ఆ నాటకాలవాడితో, నీకేంపని?'' అని అడిగాడు కృష్ణకాంతుడు.

''ఆయన నాటకాలవాడు కాదు; అవతార పురుషుడు! గజేంద్రుడి వేషంలో ఆయన్ని చూశాను. అప్పుడు నాలో కలిగిన వీరావేశం అంతా యింతా కాదు. నేనూ, గజేంద్రుడిలా పీడితప్రజలకు సాయం చేయాలని దీక్ష పూనాను. కృష్ణకాంతుణ్ణి కలుసుకుని, నాలాగా మరెందరో యువకుల్ని ప్రభావితులను చేసేందుకు, తన నాటకాలను యింకా విరివిగా ఆడమని కోరదలిచాను,'' అన్నాడు ఏకాగ్రుడు.

''నువ్వాయన నాటకం చూశావు గదా, అప్పుడే ఎందుకు కలుసుకోలేదు?'' అని అడిగాడు కృష్ణకాంతుడు.

''ముందు నేనూ గజేంద్రుడిలా తయారవాలనిపించింది. ఇప్పుడు నేను చేసే

చరించి దొంగలను అటకాయించాడు. కృష్ణకాంతుడికి, అతణ్ణి ఏ నాడూ చూసిన గుర్తు లేదు.

నలుగురు దొంగలూ, యువకుడూ కలబడ్డారు. యువకుడు నేర్పుగా సుశిక్షితుడైన మల్లుడిలా పోరాడుతూ, ఒక దొంగ నుంచి కత్తి లాక్కున్నాడు. ఇది చూసి దొంగలు భయకంపితులై, అక్కణ్ణించి పారిపోయారు.

''ఎవరు నువ్వు? సమయానికి దేవుడిలా వచ్చి రక్షించావు!'' అన్నాడు కృష్ణకాంతుడు.

''నా పేరు, ఏకాగ్రుడు. నా శక్తికొద్దీ అన్యాయాలనూ, అక్రమాలనూ అరి

సాహస కార్యాలను ఎందరో ప్రశంసిస్తుంటే, దీనికంతకూ కారణం అయిన, ఆ మహానుభావుణ్ణి కలుసుకోవాలని తోచింది. అందుకే వెళుతున్నాను,'' అన్నాడు ఏకాగ్రుడు.

కృష్ణకాంతుడి ముఖం పాలిపోయింది. అతడు తడబడే మాటలతో, ''నేనూ కృష్ణకాంతుణ్ణి కలుసుకోవడం కోసమే, ఆ గ్రామం వెళ్ళాను. ఆయన అక్కడ లేడు; రాజధానికి వెళ్ళిపోయాడు,'' అని ఏకాగ్రుడికి చెప్పి, మాలతి గ్రామం చేరి, ఆమెతో, ''నీ కోసం నాటకాలాడడం మానివెయ్యి తలుచుకున్నాను,'' అని చెప్పాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, కృష్ణకాంతుడు అంత త్వరగా మనసు మార్చుకుని, మాలతితో వివాహానికి ఎందుకు ఒప్పుకున్నాడు? అతడికి నాటకాలంటే మొహం మొత్తిందా? కీర్తి ప్రతిష్ఠలపట్ల చులకన భావం ఏర్పడిందా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల బద్దలవుతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''నువు చెప్పిన వేవీ కృష్ణకాంతుడు మనసు మార్చుకోవడానికి ముఖ్య కారణాలు కాదు. తన గజేంద్ర పాత్ర ద్వారా అతడు ఎందరో యువకుల్ని అన్యాయాలనూ, అక్రమాలనూ ప్రాణాలొడ్డి ఎదిరించే వీరులుగా తయారు చేశాడు. కాని, తాను మాత్రం దొంగల ఎదట పిరికివాడిలా ప్రవర్తించాడు. ఈ అనుభవంతో, కృష్ణకాంతుడికి తను నటించే గజేంద్రుడి పాత్ర, తనపై ఎలాంటి ప్రభావం చూపలేదని అర్థమైంది. తన అసలు రూపం నలుగురికీ తెలిస్తే, ఇంతకాలంగా గజేంద్రుడిపాత్ర కలిగిస్తున్న ప్రభావంకాస్తా పోతుంది. అందుకే అతడు మాలతిని వివాహం ఆడి, అజ్ఞాతంగా బతికేందుకు సిద్ధపడ్డాడు'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# మూలకారణం

కొత్త వంటవాడుగా చేరేందుకు వచ్చిన వ్యక్తి, జమీందారుకు చాలా అమాయకుడిలా కనిపించాడు. అతణ్ణి గురించి కొన్ని ఆరాలు తీశాక, యింకా అనుమానం వదలక ఆయన, "చాలా చోట్ల వంటవాడుగా వున్నానంటున్నావు. మరి అన్ని ఉద్యోగాలు ఎందుకుపోయినట్టు! ఎక్కువ నాగాలు పెట్టేవాడివా?" అని అడిగాడు.

"వంటవాడు నాగాలుపెడితే, ఇంటిల్లిపాదికీ యిబ్బందిగా, బాబూ," అన్నాడు వంటవాడు.

"పోనీ, వండుతున్నప్పుడే, రుచిచూసే నెపంతో వంటకాలన్నీ తినేసే దురలవాటున్నదా?" అన్నాడు జమీందారు.

"వండుతూ, ఎంతని తింటాను బాబూ! ఇంట్లోవారంతా తినగా, మిగిలింది నేనేగదా తినేది," అన్నాడు వంటవాడు.

"వంటసామగ్రి దొంగిలించే చెడుబుద్ధేం లేదుగదా?" అన్నాడు జమీందారు.

"మొత్తం వంటగదే, నా చేతికిందవుండగా, ఆ పాడుపనెందుకు," అన్నాడు వంటవాడు.

"మరైతే, అన్నిచోట్ల పని మానుకోవడానికి కారణం ఏమిటి?" అన్నాడు జమీందారు విసుగుపడుతూ.

"మతి స్థిమితం లేనివాళ్ళుగనక, అప్పుడప్పుడూ వంటవాణ్ణన్నమాటే మరిచి తోటమాలీ పనికీ, గుర్రాలను మాలీస్ చేసేందుకూ పోతూంటానని, పనిలోనుంచి తీసేస్తూంటారు, బాబూ!" అన్నాడు వంటవాడు.

— బీ బీ జాన్






# మంత్రిపదవి

చిత్రపురి రాజ్యమంత్రి సోమేశ్వరుడు, ఆ రాజ్యపాలకులైన రెండు తరాలవారికి, పరిపాలనా విషయాల్లో వివేకవంతమైన సలహాలు యిస్తూ, గొప్ప సమర్థుడని పేరు తెచ్చుకున్నాడు.

ఆయన తన డెభైయవ ఏట, యిక మంత్రిపదవి నుంచి వైదొలగదలచి, ఆ సంగతి రాజు అవంతుడికి చెప్పాడు. అవంతుడు రాజ్యాధికారానికి వచ్చి, అప్పటికి నాలుగు సంవత్సరాలయింది.

గొప్ప దక్షతా, రాజభక్తీగల వృద్ధ మంత్రి పదవీ విరమణ చేస్తాననడం, రాజుకు చాలా బాధ కలిగించింది. అయినా చేసేదిలేక, ఆయన మంత్రితో, "తమ స్థానంలో వుండగల సమర్థుణ్ణి, తమరే ఎన్నిక చేయండి," అని కోరాడు.

సోమేశ్వరుడు యిందుకు ఒప్పుకోలేదు. "మా తరం గడిచిపోయింది. కొత్తతరం వాళ్ళ శక్తిసామర్థ్యాలను గురించి, నాకు అంతగా తెలియదు," అన్నాడాయన.

రాజు అవంతుడు మంత్రి పదవికి అర్హులైన వారికోసం దేశంలో చాటింపు వేయించాడు. ఆ పదవి కోరివచ్చిన అనేకమంది విద్యాధికులైన యువకుల్లో, రాజుకు అనంతవర్మ, కపిలనాధుడు, రామమిశ్రుడు అనేవాళ్ళు అందుకు తగినవారుగా కనిపించారు.

రాజు అవంతుడు బాగా ఆలోచించి, ఒక నిశ్చయానికి వచ్చి, ముందుగా తన ఆలోచనామందిరానికి అనంతవర్మను పిలిపించి, అతడితో, "నువ్వు మంత్రి పదవి నిర్వహిస్తున్నకాలంలో, ఒక బీద కుటుంబం నీ దగ్గిరకు వచ్చి, తాము రెండు రోజులుగా పస్తులుంటున్నామనీ, ఏదైనా సాయం చెయ్యమనీ అడిగితే, నువ్వేం చేస్తావు?" అని ప్రశ్నించాడు.

వల్లూరు బాబురావు

"మహారాజా, ఆ బీద కుటుంబానికి అన్నివిధాలా సాయం చేసి, జీవితంలో వాళ్ళకు మరేనాడూ తిండికొరత అన్నది కలగకుండా చూస్తాను," అని జవాబిచ్చాడు అనంతవర్మ.

ఆ తర్వాత రాజు కపిలనాధుణ్ణి పిలిపించి, అదే ప్రశ్న అడిగాడు. కపిలనాధుడు ఒక క్షణకాలం ఆలోచించి, "మహారాజా అసలు ఆ కుటుంబం పస్తులుండవలసిన స్థితి ఎందుకు కలిగిందో, దాని పూర్వాపరాలు క్షుణ్ణంగా విచారిస్తాను. తరవాత ఆ కుటుంబానికి సాయం చేయడమేకాక, రాజ్యంలో మరెవరికీ తిండిలేని దుస్థితి కలగకుండా తగిన ఏర్పాట్లు చేయిస్తాను," అన్నాడు.

రాజు రామమిశ్రుణ్ణి పిలిపించి, తతిమ్మా యిద్దరినీ అడిగినట్టే అడిగాడు.

రామమిశ్రుడు ఆ ప్రశ్న వింటూనే, "మహారాజా, నా మంత్రిపదవీ కాలంలో దేశంలో ఎవరికైనా తిండీ, బట్టకు కొరత అంటూ ఏర్పడినట్టు తెలిసిన మరుక్షణం, నేను నా పదవికి రాజీనామా యిస్తాను," అన్నాడు.

రాజు ఆశ్చర్యపోయి, "మంత్రిపదవే వదులుకుంటావా! కారణం?" అన్నాడు.

"ఎంతో కాలంగా సాగుతున్న తమ చల్లని పరిపాలనలోనూ, వృద్ధులైపోయిన మహామంత్రిగారి అధ్వర్యంలోనూ, రాజ్యంలోని ఏ ఒక్కరూ యీనాటివరకూ తిండి దొరకని దీనావస్థలపాలు కాలేదు. అలాంటిది, నేను మంత్రినైన తర్వాతనే ప్రజల్లో ఏ కొద్దిమందికైనా, యీ దుస్థితి సంభవించిందంటే, అందుకు మంత్రిగా నా అసమర్థతే కారణం అవుతుంది. అందువల్ల, నేను మంత్రిపదవి వదులుకుని, మరెవరైనా సమర్థులకు ఆ పదవి లభించే అవకాశం యిస్తాను," అన్నాడు రామమిశ్రుడు.

ఈ జవాబు రాజుకు చాలా సంతోషం కలిగించింది. ఆయన, ఆ రోజునే రామమిశ్రుణ్ణి చిత్రపురి రాజ్యమంత్రిగా ప్రకటించాడు.





# అల్లుడి పాట్లు

తెల్లవారుతూనే అత్తగారూ, మరదలూ వస్తున్న వార్త విని, నారాయణ తెల్లబోయాడు. అతడు భార్య రుక్మిణితో పట్నంలో కాపరం పెట్టి, యింకా పట్టుమని పది రోజులు కూడా కాలేదు.

"ఈ పది రోజులకే మీ వాళ్ళు, నీ మీద బెంగ పెట్టుకున్నారా?" అని అడిగాడు నారాయణ భార్యను.

రుక్మిణి నవ్వి, "అదేమీ కాదు! మా అమ్మ ఆరోగ్యం బాగాలేదట. గాలి మార్పుకూ, పట్నం వైద్యానికీ వస్తున్నది. మా చెల్లెలికి పట్నంలో అయితే పెళ్ళి సంబంధం సులభంగా కుదురుతుందని, మా నాన్న ఆశ. అందుకే యిద్దర్నీ పంపిస్తున్నాడు," అన్నది.

ఈ జవాబుతో నారాయణకు నీరసం ముంచుకు వచ్చింది. అతడికి వచ్చే జీతం నలుగురు మనుషులు తినడానికీ, వైద్యాలకూ చాలదు. అయితే, స్వతహాగా మొహమాటస్థుడు కావడంతో, మెదలకుండా వూరుకున్నాడు.

కొద్దిసేపు తరవాత అత్తగారూ, మరదలూ దిగారు. అత్తగారు వస్తూనే ఆయాసపడుతూ, కంచుగ్లాసుడు పాలు తెప్పించుకుని తాగి, రుక్మిణితో, "ఈ నీరసంతోనే ఏదో ఒకరోజు గుటుక్కుమంటానే, తల్లీ! నీ చెల్లెలి పెళ్ళి అయిపోతే, యిక బెంగ అంటూ వుండదు. కొడుకులులేని మనకు, అల్లుడే కొడుకు అంటాడు, మీ నాన్న. అందుకే, చెల్లెలి పెళ్ళి బాధ్యతా, నా వైద్యం భారం అల్లుడి మీద పెట్టేశాడు," అంటూ కూతురుకు కష్టసుఖాలు చెప్పుకున్నది.

మరదలి పెళ్ళి బాధ్యత తన మీద పెట్టారన్న సంగతి వింటూనే, ఏదో బండరాయి మీద పడినట్టు బాధపడిపోయాడు, నారాయణ. అయినా పైకి నవ్వుతూ,

మాచిరాజు కామేశ్వరరావు

"ఇవేమంత పెద్ద బాధ్యతలు కాదు లెండి," అనేశాడు.

"బావ మనసు బంగారం అని, బయలుదేరక ముందే చెప్పా గదా!" అంటూ మరదలు, పక్కనే వున్న కొత్త మంచం మీద దభీమంటూ కూర్చున్నది.

మంచం కాస్త అసనాటుగా పెట్టి వుండడం, ఆమెది కొంచెం స్థూలదేహం కావడంతో, అది కాస్తా ఫెళఫెళమంటూ విరిగిపోయింది. కొత్త మంచం అలా ధ్వంసం అవడం చూస్తూనే, నారాయణకు మతిపోయినంత పనైంది.

ఒకవారం గడిచింది. అత్తగారి జబ్బేమిటో నారాయణకు అంతుబట్టలేదు. ఆమెకు మంచి తిండిపుష్టి వున్నది. అయినా ఉపవాసాలు చేస్తున్నట్టు, నీరస పడిపోతూంటుంది. ఇల్లు నగరం మధ్య లోని మంచిపేటలో వుండడంతో, ఆమెకు ఇరుగు పొరుగు అమ్మలక్కలతో కబుర్లాడుతూ కాలక్షేపం చేసేందుకు మంచి అనువుగా వున్నది.

నెల తిరిగేసరికి నారాయణ అక్కడా యిక్కడా అప్పులు చేయవలసి వచ్చింది. ఒకరోజు అతడి తోటి ఉద్యోగి భద్రయ్య, "చూడు, నారాయణా! నువు చిన్నవాడివి. దురభ్యాసాలు మనిషి పతనానికి దారి తీస్తాయి," అన్నాడు.

నారాయణ నివ్వెరపోయి, "దురభ్యాసాలా! నీకెవరు చెప్పారు?" అని అడిగాడు.



''నువు చేసే అప్పులే చెబుతున్నాయి.'' అన్నాడు భద్రయ్య.

నారాయణ తన ప్రస్తుత పరిస్థితులు భద్రయ్యకు వివరించాడు. భద్రయ్య కొంచెంసేపు ఆలోచించి, ''అయితే, నువ్వు వెంటనే యిల్లు ఖాళీచేసి, ఊరికి పెడగా, ఎవరూ అద్దెకు రాని మా బాబాయి ఇంట్లో చేరు,'' అని, అందువల్ల కలగబోయే లాభం గురించి చెప్పాడు.

నారాయణ ఆ మరసటి రోజునే, ఇంటి యజమాని ఇల్లు ఖాళీ చేయమంటున్నాడని చెప్పి, భద్రయ్య బాబాయిగారి ఇంట్లో కాపరంపెట్టాడు. ఆ ఇంట్లో బావిలేదు. వీధి పక్కన వున్న బావిలోంచి నీళ్ళు తెచ్చుకోవాలి.

ఇరుగు పొరుగులతో కబుర్ల కాలక్షేపం లేక అత్తగారికి పిచ్చెత్తినట్టు వుంటున్నది. మరదలు యీ కారడవిలో కాపరం ఏమిటని గొడవ ప్రారంభించింది. రుక్మిణి ఇంటెడు పనీ తనతోపాటు తల్లిచేతా, చెల్లెలిచేతా చేయించసాగింది.

''నీ ఉపాయం బాగా పారింది. ఖర్చులు కొంత తగ్గాయి,'' అని, నారాయణ భద్రయ్యను మెచ్చుకున్నాడు.

''అప్పుడే ఏమైంది! ఈ సాయంత్రం మీ ఇంటికి వస్తాను. నన్ను వైద్యుడుగా పరిచయం చెయ్యి,'' అన్నాడు భద్రయ్య.

ఆ సాయంత్రం నారాయణ, భద్రయ్యను ఇంటికి తీసుకు వెళ్ళాడు. భద్రయ్య అత్తగారిని పరీక్ష చేస్తున్నట్టు



నటించి, "ఇది మీబోటి వాళ్ళకు రావల సిన జబ్బు కాదు. కాలేయం పూర్తిగా పాడయిపోయింది. అయినా భయంలేదు! ఉప్పు, కారాలు తగలకుండా వండిన కొద్దిపాటి కూరతో, గుప్పెడంటే గుప్పెడు అన్నం కలిపి, రోజూ రెండు పూటలా కనీసం మూడు నెలల పాటు తినాలి. ఈ పథ్యం పాటించకపోతే, ప్రాణానికే ముప్పు," అని చెప్పాడు.

ఆ మాటలు వినగానే అత్తగారి శరీరం నిజంగానే నీరసపడిపోయింది. ఆ సమయంలో అటూ యిటూ పచార్లు చేస్తున్న మరదలిని దగ్గిరకు పిలిచి, భద్రయ్య, "ఇంత చిన్న వయసుకే అంత ఒళ్ళు ప్రమాదకరం. గుండెజబ్బులు వస్తాయి. రోజూ యీ అమ్మాయిచేత ఒకటి, రెండు మైళ్ళ దూరం పరిగెత్తించండి. కొన్నాళ్ళ పాటు అన్నం మానేసి, కేవలం రొట్టె తిని వూరుకోవడం క్షేమం," అని చెప్పాడు.

భద్రయ్య వైద్యం వారం రోజులు అమలు జరిగేసరికి, మరదలు తల్లితో, "అమ్మా, ఇక మన ఊరు వెళ్ళిపోదాం. ఇక్కడ వుంటే పెళ్ళి మాటకేంగాని, నా ప్రాణాలే నిలిచేలా లేవు," అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకున్నది.

"నా సంగతి నీ కన్న ఏం మెరుగ్గా లేదులే," అంటూ అత్తగారు కళ్ళొత్తుకున్నది.

ఈ మాటలు విన్న నారాయణ, "అదేమిటి, అప్పుడే వెళతారా? మామగారు నా పైన పెట్టిన బాధ్యతలమాటేమిటి?" అన్నాడు.

అత్తగారు విసుక్కుంటూ, "నీకేమన్నా మతిపోయిందా? కూతురు పెళ్ళి, భార్య వైద్యం చూసుకోవలసింది, మీ మామగారు. బాధ్యతల్ని బదిలీ చేస్తే భరించే అమాయకుణ్ణి, నిన్నే చూశాను!" అని, అప్పటికప్పుడు బాడుగ బండి కట్టించుకుని, కూతురితోపాటు బయలుదేరి వెళ్ళిపోయింది.

ఆ మర్నాడే నారాయణ, తనకు అన్ని సౌకర్యాలూ అమరి వున్న పాత ఇంటికి కాపరం మార్చాడు.





# మంత్రపటిమ

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించే కాలంలో, ఒకప్పుడు బోధిసత్వుడు, ఒక గ్రామంలో చర్మకారుడుగా జన్మించాడు. ఆయన తన వృత్తి ధర్మం నిర్వహించుకుంటూనే, ఒక సిద్ధుణ్ణి ఆశ్రయించి, ఆయన ద్వారా ఒక అపూర్వమైన మంత్రం నేర్చుకున్నాడు.

ఆ మంత్రశక్తితో చర్మకారుడైన బోధిసత్వుడు అకాలంలో మామిడి పళ్ళ చెట్లకు కాయించేవాడు. ఆయన రోజూ ఉదయానే ఒక కొంకి కర్ర భుజాన వేసుకుని, అడవిలో వున్న ఒక మామిడిచెట్టు వద్దకు వెళ్ళేవాడు. అక్కడ చెట్టుకు ఏడడుగుల దూరాన నిలబడి మంత్రం పఠించేవాడు. తరవాత కొమ్మల మీద మంత్రజలం చల్లేవాడు. ఆ వెంటనే, మామిడి కొమ్మలు కొత్త ఆకులు తొడిగి పూతపూసి, కాయలు కాసేవి.

ఒకరోజున ఆయన మామిడి చెట్టుకు యిలా కాయలు కాయిస్తూండగా, దర్భలకై అడవికి వచ్చిన సునందుడు అనే ఒక బ్రాహ్మణ కుర్రవాడు చూశాడు. అతను ఆ ప్రాంతానికి దాపునగల ఒక అగ్రహారంలో వుండేవాడు. చదువు సంధ్యలేమీ అబ్బలేదు. కాని, ఏ దేవి కృపవల్లో క్షణాల మీద పండితుడైపోవాలనీ, వెండీ, బంగారాలతో తులతూగాలనీ కలలు కంటూండేవాడు.

బోధిసత్వుడు అడవి నుంచి ఇంటికి రాగానే, సునందుడు ఆయన కొంకికర్రా, మామిడిపళ్ళ మూటా అంది పుచ్చుకుని, తరవాత, ఆయనతో తాను ఫలానా అని చెప్పుకుని, ఆనాటి నుంచీ ఇంటి పనులన్నీ శ్రద్ధాభక్తులతో చేయసాగాడు.

ఇలా కొంతకాలం జరిగింది. ఒకనాడు బోధిసత్వుడు భార్యతో, "ఈ కుర్రవాడు

జాతకకథ



మనలను ఎందుకు ఆశ్రయించాడో తెలుసా? వాడికి అకాలంలో మామిడి పళ్ళు సృష్టించే మంత్రం నేర్చుకోవాలని ఆశగా వున్నది. వాడు చాలా దురాశాపరుడు. నేను దయతలచి మంత్రం నేర్పినా, వాడికి అది ఎంతోకాలం మేలు కలిగించదు,'' అన్నాడు.

సునందుడు ఇంట్లో అంటి పెట్టుకొని వుంటూ, తలలో నాలుకలా మసులుకోవడం చేత, బోధిసత్వుడి భార్యకు అతడంటే చాలా జాలి కలిగింది. ఆమె భర్తతో, '' ఈ పిల్లవాడు మన ఇంట అడ్డమైన పనులూ చేస్తూ, కన్నకొడుకు కంటె ఎక్కువ అణుకువగా వుంటున్నాడు. మంత్రం వాడికి ఉపయోగించకుండా ఎందుకు పోతుంది? ఒకవేళ అలా జరిగితే దోషం వాడిదే అవుతుంది! మీరు మాత్రం వాడికి మంత్రం ఉపదేశించక తప్పదు,'' అన్నది.

బోధిసత్వుడు కొంచెం ఆలోచించి, భార్య మాటల్లోని ఇంగితాన్ని గుర్తించి, సునందుడికి మంత్రం ఉపదేశిస్తానన్నాడు.

ఆ మర్నాడు ఆయన సునందుణ్ణి పిలిచి, '' నాయనా, ఇది చాలా అపూర్వమైన మంత్రం. దీన్ని న్యాయమార్గాన ఉపయోగించుకున్నావంటే ధనమూ, కీర్తీ రెండూ లభిస్తాయి. కాని, ఒక సంగతి గుర్తుంచుకో! దీనిని ఎవరి దగ్గర నేర్చుకున్నావు? అన్న ప్రశ్న ఎవరైనా అడిగినప్పుడు మాత్రం, రహస్యం వెల్లడించకూడదు. రహస్యం వెల్లడించావో, ఆ క్షణం నుంచీ మంత్రపటిమ అంతరించిపోతుంది,'' అని చెప్పి, మంత్రం ఉపదేశించాడు.

సునందుడు మంత్రం నేర్చుకుని ఇల్లు చేరి, అకాలపు మామిడిపళ్లు సృష్టిస్తూ, వాటిని విక్రయించి ధనం సంపాయించసాగాడు.

సునందుడు సృష్టించే యీ అకాలపు మామిడి పళ్ళలో ఒకటి, కాశీరాజుకు చేరింది. ఆయన ఆశ్చర్యపడి, వాటిని

సృష్టిస్తున్న వాళ్ళు ఎవరా అని విచారించి, సునందుడని తెలియగానే, అతణ్ణి పిలిపించాడు.

"ఋతువు కాని ఋతువులో, యీ మామిడిపళ్ళు నువ్వెక్కడి నుంచి తెస్తున్నావు? ఇవి దైవసృష్టా? మానవసృష్టా? దాచకుండా నిజం చెప్పు," అని రాజు సునందుణ్ణి అడిగాడు.

సునందుడు, రాజుతో మహానందంగా, "మహారాజా! నేను విక్రయించే ఈ మామిడి పళ్లు, నేను సృష్టిస్తున్న . నా కొక మహా మంత్రం తెలుసు! దాని మహిమ వల్లనే, నేను అకాలంలో మామిడి చెట్లకు కాయలు కాయస్తూంటాను," అన్నాడు.

ఈ జవాబుకు రాజు మరింతగా ఆశ్చర్యపోతూ, "అలాగా! ఆ మంత్ర పటిమ ఎలాంటిదో స్వయంగా చూడాలని కోర్కెగా వున్నది. నా ఉద్యానవనంలోని చెట్లకు, నీ మంత్ర మహిమతో కాయలు కాయించగలవా?" అన్నాడు.

సునందుడు సంతోషంగా యిందుకు ఒప్పుకున్నాడు. మర్నాడు రాజూ, పరివారం వెంటరాగా ఉద్యానవనంలోకి వెళ్లాడు. అక్కడ ఒక చెట్టుకు ఏడడుగుల దూరంలో నిలబడి మంత్రం పఠించి, కమండలంలో నుంచి దాని కొమ్మల మీద మంత్రజలం చల్లాడు. వెంటనే చెట్టు నుంచి వందల సంఖ్యలో మామిడిపళ్ళు కింద రాలినై.



ఈ అద్భుతం చూసి రాజూ, ఆయన పరివారం పొందిన ఆశ్చర్యం అంతా, యింతా కాదు. వాళ్ళు పళ్ళను ఏరి తెచ్చుకుని తిని చూశారు. అద్భుతమైన రుచి. రాజు, సునందుణ్ణి ఘనంగా సన్మానించాడు.

తరవాత ఆయన సునందుణ్ణి, "ఇంత గొప్ప శక్తిగల మంత్రాన్ని, నీకు ఉపదేశించిన మహా జ్ఞాని ఎవరు?" అని ప్రశ్నించాడు.

సునందుడికి ఏమి చెప్పడానికీ పాలుపోలేదు. నిజం వెల్లడిస్తే, మంత్రపటిమ పోతుందని చెప్పిన గురువు మాటలు అతడికి జ్ఞాపకం వున్నవి. ఐనా, కంఠతా వచ్చిన మంత్రానికి పటిమ పోవడం ఏమిటి? ఇవన్నీ గురువుగారి భేషజపు పలుకులు అనుకుని, రాజుకు తాను మంత్రం ఎక్కడ నేర్చుకున్నదీ చెప్పేశాడు.

రాజు హేళన చేస్తూ నవ్వి, "ఇంత పటిమగల గొప్ప మంత్రాన్ని నువ్వు నేర్చుకున్నది చర్మకార వృత్తిలో బతికేవాడి దగ్గరా? బ్రాహ్మడివై వుండీ, ఇహలోక సౌఖ్యాలుకోరి, స్వధర్మాన్నిమంటగలిపావు. ఇది చాలా నీచమైన పని," అన్నాడు.

రాజు యిలా అనేసరికి సునందుడు మాట్లాడకుండా తల వంచుకుని ఇంటికి వెళ్ళాడు.

కొంతకాలం గడిచింది.

ఒకనాడు కాశీరాజుకు మామిడిపళ్ళు తినాలన్న కోర్కె కలిగింది. ఆయన సునందుణ్ణి పిలిపించి, సంగతి చెప్పాడు. అందరూ కలిసి తోటలోకి వెళ్ళారు.

సునందుడు ఎప్పటిలా చెట్టుకు ఏడడుగుల దూరంలో నిలబడి మంత్రం పఠించబోయాడు. కాని, ఎంతకూ అది స్ఫురణకు రాలేదు. తరవాత ఎంత ప్రయత్నించినా మంత్రం జ్ఞాపకం రాకపోయేసరికి, తను గురువాజ్ఞ తప్పడంవల్ల, మంత్రం పూర్తిగా మర్చిపోవడం జరిగిందని తెలుసుకున్నాడు.

ఆశ్చర్యపోయి చూస్తున్న రాజుతో, సునందుడు తాను గురువాజ్ఞను ధిక్కరించడంవల్ల మంత్రపటిమ పోగొట్టుకున్నానని చెప్పి, విచారంగా ఇంటికి వెళ్ళిపోయాడు.






# భర్తృహరి కథ

క్రీ. శ. ఏడవ శతాబ్దంలో, భర్తృహరి అనే రాజు ఉజ్జయిని రాజధానిగా పరిపాలిస్తూండేవాడు. ఆయన విలాస జీవితానికి అలవాటు పడినవాడైనా, పరిపాలనా విషయాల్లో మాత్రం దయా ధర్మగుణాలు కలవాడు.

నగరానికి దాపులనున్న అరణ్యంలో ఒక ముని నివసిస్తుండేవాడు. ఒకనాడు వింత ఫలం ఒకటి ఆయన కళ్ళముందు తేలి యాడుతూ కనిపించింది. కొంచెం ఆలోచించినమీదట, ముని ఆ ఫలం తన ధ్యానశక్తి ఫలితం అనిగ్రహించాడు.





ఆ వింత ఫలం అద్భుతశక్తులు గలది. దాన్ని తిన్నవాడు నూరు సంవత్సరాల పాటు యౌవనవంతుడుగా వుంటాడు. రాజు భర్తృహరి ఆ ఫలాన్ని తినడానికి అర్హుడని ముని భావించాడు. ఆయన దాన్ని భర్తృహరికి బహూకరించాడు.



భర్తృహరికి తన చిన్న భార్య అంటే పంచప్రాణాలు. ఆయన ఫలాన్ని అప్పటి కప్పుడే తన చిన్న భార్య వున్న అంతః పురానికి తీసుకుపోయి, ఆమెకు యిచ్చాడు.

మరసటిరోజు ఆయన వేటకై అరణ్యా నికి వెళ్ళాడు. వేటనుంచి తిరిగివచ్చే సమయంలో, ముసుగు ధరించిన స్త్రీ ఒకతె ఆయనకు ఎదురుపడి, తనవెంట ఒక నిర్జన ప్రదేశానికి రావలసిందిగా కోరింది.





త్వరలోనే రాజు, ఆమె అద్భుత సౌందర్యవతి అయిన నర్తకి అని గుర్తించాడు. ఆమె, ఆయనకు ఒక ఫలాన్ని యిస్తూ, "ఈ ఫలం తన అమోఘ శక్తి వల్ల మిమ్ములను నూరు సంవత్సరాల కాలం యౌవనంతో జీవిం చేలా చేస్తుంది. ఈ ఫలాన్ని తినే అర్హత నాకు లేదు; మీరు అందుకు అర్హులైనవారు," అని చెప్పి, వేగంగా అక్కడినుంచి వెళ్ళిపోయింది.

రాజు, ముని దగ్గిరకు వెళ్ళి, అద్భుత శక్తులుగల ఫలం మరొకదాన్ని ఎవరైనా నర్తకికి యిచ్చారా, అని అడిగాడు. అలాంటి ఫలం మరొకటి లేదని ముని, రాజుకు చెప్పాడు.





ఆ జవాబుతో భర్తృహరి పొందిన ఆశ్చర్యం అంతా యింతా కాదు. ఆయన అక్కడే ఒక కొండరాయిమీద కూర్చుని, వింత ఫలం నర్తకికి ఎలా లభించింది? దాని వెనకవున్న నిగూఢరహస్యం ఏమిటి? అని ఆలోచించసాగాడు.

తరవాత ఆయన నగరం చేరి విచారణ ప్రారంభించాడు. అందులో బయట పడినదేమంటే, ఆయన చిన్న భార్యకు ఒక రాజోద్యోగి మీద తగని ప్రేమ. ఆమె ఫలాన్ని భర్త నుంచి తీసుకుని, అతడికి యిచ్చింది.





అయితే, ఆ రాజోద్యోగి ఫలాన్ని తాను తినకుండా, ఆ సాయంత్రం దాన్ని నర్తకికి యిచ్చాడు. అతడికి ఆమె పట్ల ఎంతో ప్రీతి.

వజ్రాఘాతంలాంటి, యీ రహస్యం తెలుసుకుని భర్తృహరి కొద్ది రోజుల పాటు విచారగ్రస్థుడయ్యాడు. తర వాత ఆయన ఒక రాత్రివేళ సింహా సనాన్నీ, సుందర రాజధానీనగరాన్నీ విడిచి, అరణ్యాంచేరి మౌనిలా శేష జీవితాన్ని గడిపాడు.





సన్యసించిన తరవాత భర్తృహరి చాలా గ్రంథాలు రాశాడు. వాటిలో వైరాగ్య శతకం అనే నూరు పద్యాలు గల గ్రంథం ఒకటి. ఇది జీవితంలో ఎదు రయ్యే ప్రలోభాలనూ, భేషజాలనూ బహిర్గతంచేసి, మనుషులకు వాటిపట్ల గల భ్రమలను తొలగించేందుకు సాయపడుతుంది.



# బద్ధకస్తుడి బాగు

రంగమ్మకు యిద్దరు కొడుకులు. పెద్దవాడు దానయ్య కష్టపడి పనిచేసేవాడు. చిన్నవాడు శీనయ్య పరమ బద్ధకస్థుడు. దానయ్య ఇతరుల పొలాల్లో కూడా కూలీ నాలీ చేసి సంపాదిస్తుంటే, శీనయ్య అస్తమానం తిరిగేవాడు.

ఎంత చెప్పినా శీనయ్యకు బద్ధకం వదలక పోవడంతో, రంగమ్మకు విసుగు పుట్టింది. కనీసం వేరుపడితేనన్నా శీనయ్య బతుకు తెరువు కోసం బద్ధకం వదుల్చుకుని పని చేస్తాడనే ఉద్దేశంతో, రంగమ్మ అన్నదమ్ములను వేరు పెట్టింది.

దీనితో శీనయ్య గుండెల్లో రాయి పడినట్టయింది. వాడికి ఏం చేయాలో తోచలేదు. పగలంతా ఊళ్లో తిరిగి, చీకటి పడుతూనే వాడు ఊరి బయట వున్న పాడుబడ్డ దేవాలయం చేరి, దాని అరుగు మీద పడుకున్నాడు.

అర్ధరాత్రి సమయంలో ఏదో చప్పుడై శీనయ్యకు మెలుకువ వచ్చింది. ఎదురుగా దేవతలా మెరిసిపోతూ ఒక స్త్రీ కనిపించింది. వాడు నోరెత్తి ఏదో అనబోయేంతలో ఆమె, "ఎవరు నాయనా, నువ్వు? ఇక్కడ ఎందుకు పడుకున్నావు?" అని అడిగింది.

శీనయ్య ధైర్యం తెచ్చుకుని, ఆమెకు నమస్కరించి, "తల్లీ, నన్ను శీనయ్య అంటారు. ఒంటరివాణ్ణి. బతుకు తెరువు కోసం వెతుక్కుంటున్నాను," అన్నాడు.

దేవత వాడి మీద జాలిపడి, "నువ్వేం పని చెయ్యగలవో చెప్పు? అందులో నీకు అన్ని విధాలా కలిసి వచ్చేలా చేస్తాను," అన్నది.

"నాకు కొద్దో గొప్పో వ్యవసాయం చేయడం మాత్రం చేతనవును," అన్నాడు శీనయ్య.

గుంటక సాంబిరెడ్డి

"సరే, నీకు ఆ వ్యవసాయప్పనుల్లో కలిసొచ్చేలా చేస్తాను," అని దేవత అదృశ్యమైంది.

"నాకు కుంట భూమి కూడా లేదు. వ్యవసాయం చేసేదేమిటి? కలిసొచ్చేదేమిటి?" అని శీనయ్య దేవతను అడుగుదామనుకున్నాడు.

కాని, అంతలోనే ఆమె వాడికి కనబడకుండాపోయింది.

వారం గడిచీ గడవక ముందే రాజుగారి నుంచి, గ్రామాధికారులకు ఉత్తరువులు అందాయి. దాని ప్రకారం గ్రామాధికారి భూమిలేని దానయ్యా, శీనయ్యలకు దాపులనున్న అడవి ప్రాంతాన చెరొక రెండెకరాల భూమి యిచ్చాడు.

శీనయ్య వాటాకు వచ్చిన భూమిలో తుప్పలూ, చెట్లూ ఎక్కువగా వున్నవి. దానయ్య పంతుకు పచ్చిన భూమి కొంత మెరుగ్గా వున్నది. శీనయ్య తన భూమిని సాగు చెయ్యాలంటే, ముందు చెట్లన్నీ నరకాలి.

ఈ కారణంగా, బద్ధకస్థుడైన శీనయ్య, దానయ్య దగ్గిరకు పోయి, "అన్నా, నీలాగా, నేను కష్టం చేయగలవాణ్ణి కాదు గదా? ఆ సంగతి నీకు బాగా తెలుసు. నీ కొచ్చిన భూమిలో చెట్లు చాలా తక్కువగా వున్నవి. మనం భూములు మార్చుకుందాం," అన్నాడు.

దానయ్య జాలిపడి, తమ్ముడు చెప్పినట్టే చేశాడు.



శీనయ్య తనకిప్పుడు వచ్చిన భూమిలో ఒకటీ అరా చెట్లు నరికి వేయక ముందే, దానయ్య తన భూమిలో చెట్లన్నీ కష్టపడి నరికి పారేశాడు.

ఆ సమయంలో, ఒక ఎండిపోయిన చెట్టు తొర్రలో అతడికి రెండు బంగారు కణికలు దొరికినై.

ఈ సంగతి తెలిసి శీనయ్య లబోదిబో మన్నాడు. అప్పుడే వాడికి, దేవత చెప్పిన సంగతి గుర్తు వచ్చింది. వాడు అన్న దగ్గిరకు పరిగెత్తి, ఆ సంగతి చెప్పి, దొరికిన బంగారం తనకివ్వమన్నాడు. మొత్తం కాదు గదా, సగం బంగారం యివ్వడానిక్కూడా దానయ్య ససేమిరా ఒప్పుకోలేదు.

నాలుగు రోజులు ఆగి వాడు మరొక సారి అన్న దగ్గిరకు పోయి, "అన్నా, నీ భూమిని అప్పుడే చదునుచేసి, సాగుకు సిద్ధం చేశావు. నాకు మరొక్క అవకాశం యివ్వు. మళ్లీ భూములు మార్చుకుని, ఎవరివి వాళ్లం తీసుకుందాం. ఏమంటావు?" అన్నాడు.

తమ్ముడంటే అభిమానంగల దానయ్య మనసు కరిగి అందుకు ఒప్పుకున్నాడు.

ఈ భూమిని కూడా దానయ్య చెట్లూ, తుప్పలూ నరికి శుభ్రం చేసి దున్నుతూండగా, ఒకచోట నాగటికర్రుకు ఏదో బలంగా తగిలి ఖంగుమన్నది. అతడు అక్కడ తవ్వి చూడగా లంకెల బిందెలు దొరికినై.



ఈ సంగతి తెలియగానే శీనయ్య మూర్ఛపోయినంత పని చేశాడు. వాడు తన దురదృష్టాన్ని తిట్టుకుంటూ అన్న దగ్గిరకు వెళ్ళి, లంకెలబిందెల్లో వాటా యివ్వమన్నాడు. దానయ్య ఒప్పుకోలేదు.

శీనయ్య పగలంతా విచారిస్తూ ఊరంతా తిరిగి, రాత్రికి పోయి పాడు పడిన గుడిలో పడుకున్నాడు. అర్ధరాత్రి వేళ మళ్ళీ దేవత వచ్చింది.

ఆమె శీనయ్యను చూసి చీదరించుకుంటూ, "బద్ధకపు వెధవా! నిన్ను బాగు చేద్దామని ఎన్ని అవకాశాలు కల్పించినా, నీ బద్ధకంకొద్దీ కాలదన్నుకున్నావు. రాజులో దయాగుణం కల్పించి, నీకు భూమి యిప్పించాను. చెట్టు తొర్రలో బంగారపు కణికలు పెట్టాను. తరవాత నువు మరొకసారి మార్చుకున్న భూమిలో లంకెలబిందెలు దాచాను. అన్నీ, నీ అన్న పాలయినై. నీ బద్ధకం వదిలే వరకూ, నిన్నెవరూ బాగు చెయ్యలేరు. ఇక, నీ ముఖం చూపకు!" అని అదృశ్యమైంది.

దేవత మాటలతో శీనయ్యకు తన మీద తనకే రోత పుట్టింది. వాడు ఆ రోజు మొదలు తన పొలంలో రేయింబవళ్ళు కష్టించి పనిచేసి, అన్నతో సమంగా పంట పండించాడు.

హఠాత్తుగా శీనయ్యలో వచ్చిన మార్పు చూసి, గ్రామస్థులు వాణ్ణి చాలా మెచ్చుకున్నారు.

పొలం నుంచి పంట ఇంటికి వచ్చిన రాత్రి దానయ్య వచ్చి, శీనయ్యను తన ఇంటికి తీసుకుపోయి, "తమ్ముడూ, దొరికిన బంగారంలోనూ, లంకె బిందెలలోనూ వాటా యివ్వలేదని కోపం తెచ్చుకోకు. నీ బద్ధకం పోగొట్టేందుకే, అమ్మా, నేనూ కలిసి నిన్ను వేరు పెట్టాం. ఇప్పుడు నీ బద్ధకం వదిలిపోయింది. నీకు అన్నిట్లోనూ సగం వాటా వున్నది. మళ్ళీ యిద్దరం కలిసి వుందాం. అమ్మ చాలా సంతోషిస్తుంది," అన్నాడు.

శీనయ్య యిందుకు చాలా ఆనందపడిపోతూ, సరే అన్నాడు.



# నీతిపరులు

శిళ్ళంగేరి దేశపురాజు ధర్మనందనుడు, తన రాజ్యంలోని పాఠశాలలలో బాలబాలికలకు నైతిక విద్య బోధించేందుకు, కొందరు ఉపాధ్యాయులను నియమించాలనుకున్నాడు. కాని, యిందుకు తగిన బోధకులను ఎన్నిక చేయడం ఆయనకు కష్టసాధ్యంగా కనిపించింది. మంత్రి విద్యాధరుడు, యీ సమస్యను తేలిగ్గా పరిష్కరించగలనన్నాడు.

ఆయన రాజాస్థానంలో పనిచేసే కొందరు ఉద్యోగులను సమావేశపరిచి, రాజుగారి నిర్ణయం గురించి వాళ్ళకు చెప్పి, "ఇందుకు కొత్తగా కొన్ని పాఠశాల భవనాలు కట్టించబోతున్నాం. పని పూర్తికాగానే మీకు తెలియచేస్తాం. ఈలోగా మీరు వచ్చే నెల ఒకటవతేదీ నుంచి కోశాధికారినడిగి, అదనపు జీతాలు తీసుకుపోతూ వుండండి," అన్నాడు.

రెండు, మూడు నెలలు గడిచినా భవనాల నిర్మాణం పూర్తికాలేదు. ఈలోగా బోధకులుగా నియమితులైనవాళ్ళు కొందరు వచ్చి, అదనపు జీతాలు తీసుకుపోయారు. మంత్రి అలా జీతాలు తీసుకోని వాళ్ళను పిలిపించి, కారణం అడిగాడు.

"అయ్యా, ఇంతవరకూ పాఠశాలలో మేం ఒక్కరోజైనా విద్యాబోధన చేసిందిలేదు. అలాంటప్పుడు జీతాలు తీసుకోవడం న్యాయం, నీతీ అవుతుందా?" అన్నారు వాళ్ళు.

మంత్రి, రాజుతో వీళ్ళను గురించి చెప్పి, నైతికవిద్యాబోధనకు వీళ్ళు తగిన గురువులన్నాడు. రాజు వాళ్ళను పాఠశాలలలో నైతికవిద్యాబోధకులుగా నియమించాడు.

—కోలార్ కృష్ణఅయ్యర్





# గెలుపెవరిది?

రమణమ్మ భర్త చనిపోయాక, నమ్మ కస్థులైన జీతగాళ్లతో వ్యవసాయపు పనులు చేయిస్తూ, అప్పటికింకా చిన్నవాళ్లయిన యిద్దరు కొడుకుల్ని సాకుతూ వచ్చింది. వాళ్ళు చదువుసంధ్యలు నేర్చి ఎదిగి వచ్చాక, తగిన సంబంధాలు చూసి, యిద్దరికీ పెళ్లిళ్లు చేసింది.

కోడళ్ళు విలువైన సారె చీరలతో కాపరానికి వచ్చారు.

రమణమ్మది కాస్త పెద్ద కమతం కావడంవల్ల, జీతగాళ్ళు పొలం పనులూ, పశువుల పోషణా చూస్తున్నా, మిగిలిన పనులతో అత్తా, కోడళ్ళకు ఊపిరి సలిపేది కాదు.

రమణమ్మ స్వతహా మంచి ఆరోగ్యం గల మనిషి. లోగడ జీతగాళ్ళపైన అజ మాయిషీ చేయడంతో పాటు, ఇంటి పనులు ఆమె ఒక్కతే చేసుకుంటూ వచ్చేది. కాని, ఇద్దరు కోడళ్ళు కాపరానికి వచ్చాక కూడా తనకు యిలాంటి పని పాట్లు తప్పక పోవడం, ఆమెకు బాధగా వుండసాగింది.

ఇకనుంచీ తను కూర్చున్న చోటు నుంచి కదలకుండా, వేళకు భోజనం తన దగ్గరకు వచ్చేలా చేసుకుని, సుఖపడి పోవాలన్న నిశ్చయానికి వచ్చింది, రమణమ్మ.

అయితే, ఏ శరీర బాధా లేకుండా, ఆరోగ్యంగా వుంటూనే, యిలా, తిని కూర్చోవడానికి కోడళ్ళు ఒప్పరన్న అనుమానం కలిగిందామెకు.

బాగా ఆలోచించి రమణమ్మ ఒక పథకం వేసింది. ఉన్నట్టుండి ఒకనాడు, తనకు కళ్ళు కనిపించడం లేదనీ, చెవులు వినిపించడం లేదనీ పెద్దగా గొడవ ప్రారంభించింది.

గవ్వల నిర్మలాదేవి

కొడుకులు తల్లి స్థితి చూసి, కంగారు పడిపోయి ఆమెకు పూర్తిగా విశ్రాంతి అవసరమంటూ ఒక గదిని ప్రత్యేకించి, ఆమె మంచం దిగకుండా కట్టుదిట్టం చేశారు.

రమణమ్మ తన ఎత్తు పారినందుకు చాలా సంతోషించి, వేళకు కోడళ్ళు తెచ్చి పెట్టే భోజనం తింటూ, కాలక్షేపం చేయసాగింది. కాని కోడళ్ళు చాలా తెలివైన వాళ్ళు. వాళ్ళు కొద్ది రోజుల్లోనే అత్తగారిది ఒట్టి నటన అని తెలుసుకున్నారు.

అత్తగారంటే యిద్దరు కోడళ్ళకూ మంచి గౌరవం వున్నా, ఆమె ఆడుతున్న దొంగనాటకం మాత్రం, చాలా చిరాకు కలిగించింది.

ఒకనాడు భర్తలు పొలం వెళ్ళాక, కోడళ్లిద్దరూ పిండివంటలు చేసుకుని, అత్తకు కనబడేలా వాటిని వెండిపళ్ళాల్లో పెట్టుకు కూర్చుని, కబుర్లు చెప్పుకుంటూ తినసాగారు.

"అత్తగారికి కళ్ళూ, చెవులూ దెబ్బ తిని పోవడం మన అదృష్టం. కోపం వచ్చినప్పుడు కసిగా తిట్టినా ఫరవాలేదు. అన్నట్టు, యీ రోజు చక్కిలాలు బాగా కుదిరాయి. రేపు బొబ్బట్లు చేసుకుందాం."

ఇలాంటి కబుర్లతో కోడళ్లు రమణమ్మను ఉడికించసాగారు. ఆమె కోపాన్ని బయటికి కనపడనీయకుండా మనసులోనే, "నా పాలిటికి ఎలాంటి పొగరుబోతు



కోడళ్ళు వచ్చి పడ్డారు! ఆ పిండివంట లేవో నాకు పెట్టకపోతే పోయారు; భర్తల క్కూడా పెట్టకుండా పందికొక్కుల్లా కూర్చుని హాయిగా మెక్కేస్తున్నారు!'' అనుకుంటూ, కోడళ్లు తినే వంటకాలు నోరూరిస్తుంటే, గుటకలు మింగుతూ వూరుకునేది.

ఆఖరుకు తన పథకం బెడిసికొట్టిందనీ, యీ నటన లాభం లేదనీ తేల్చుకుని, ఒకనాడు రమణమ్మ కొడుకులు ఇంట్లో వున్న సమయంలో, ''ఒరేయ్, తొందరగా రండి! ఎంత అదృష్టం! ఏ దేవత దయవల్లో నాకు తిరిగి చూపొచ్చింది!'' అన్నది పెద్దగా.

కొడుకులు సంతోషంగా తల్లి దగ్గరకు వచ్చి, ''నిజంగానా, అమ్మా!'' అని అడిగారు.

''నిజంగానేరా, బాబూ! ఆహాఁ, నాకు చెవులుకూడా వినబడుతున్నవి!'' అంటూ రమణమ్మ ఈసారి మరింత బిగ్గరగా కేక పెట్టింది.

ఇంతలో కోడళ్ళు అక్కడికి వచ్చి, ''మనం ఎంత అదృష్టవంతులం! ఓపిగ్గా ఇంటి పనులన్నీ చేయగల ఆరోగ్యం వున్న అత్తగారికి హఠాత్తుగా చూపు పోవడం, చెవులు వినబడకుండాపోవడం, యిన్నాళ్ళూ ఎంత బాధగా వున్నదో!'' అని రమణమ్మను చెరొక చేయీ పట్టుకుని, ''అత్తయ్యా! ఇక, యీ గదీ, మంచం వదిలెయ్యండి. త్వరగా చావిట్లోకి వచ్చి కాస్త బియ్యం చెరగండి, అవతల పొయి మీద ఎసరు మరిగిపోతున్నది,'' అన్నారు.

రమణమ్మ మారు మాట్టాడకుండా చావిట్లోకి వచ్చింది. ఆ క్షణంలో ఆమెకు, తనకు పెట్టకుండా పిండివంటలు చేసుకు తినే కోడళ్ల ఆట కట్టించాననే తృప్తి కలిగింది.

పనిచేసే ఓపిక వుండీ, దొంగనాటకం ఆడిన అత్తగారికి మరపలేని మంచి గుణపాఠం నేర్పామనుకుంటూ కోడళ్ళు సంతోషించారు.



# లోభివాడి పాపాలు

సుబ్బరామయ్య చాలా పాపాలు చేసిన లోభి. గంగలో మునిగితే అన్ని పాపాలూ పోతాయట. కాని కాశీకి వెళ్ళి గంగాస్నానం చేసి రావటానికి చాలా డబ్బు ఖర్చవుతుంది.

ఇంతలో పుల్లయ్య కాశీ వెళుతున్నట్టు తెలిసి, సుబ్బరామయ్య అతనితో, "పుల్లయ్యా, నేను కాశీ వెళితే రెండు వందలు ఖర్చవుతుంది. నువు ఎలాగూ పోతున్నావు గనక, నా పాపాలన్నీ నువు తీసుకున్నట్టు భావించుకుని, నీ పాపాలతో బాటు నావి కూడా కడిగెయ్యి. నేను వంద రూపాయలిస్తాను," అన్నాడు.

"సరే, తే!" అని పుల్లయ్య సుబ్బరామయ్య దగ్గిర వంద రూపాయలూ తీసుకున్నాడు, కాని కాశీ వెళ్ళలేదు.

"ఏం, పుల్లయ్యా? ఎప్పుడు నీ కాశీ ప్రయాణం?" అని సుబ్బరామయ్య అడిగాడు.

"కాశీ వెళ్ళటంలేదు. మన ఊరి చెరువులోనే మునిగి, అదే గంగ అని భావించుకున్నాను!" అన్నాడు పుల్లయ్య.

—శరత్





# తపః ఫలం

పూర్వ కాలమందు రాజ్యవర్ధనుడు అనే మహారాజు ఉండేవాడు. ప్రజలకు అతనంటే ప్రాణంగా ఉండేది. రాజు కూడా వారిని కన్నబిడ్డల్లాగా పాలిస్తూ వచ్చాడు.

ఒకనాడు భర్తకు తలంటు పోస్తూ రాణి కంట తడి పెట్టింది. అది చూచి రాజు ఆమెను కారణం అడిగాడు. అందుకు రాణి, "కారణం ఏమిటని చెప్పను—మీ తల వెంట్రుకలు నెరిసిపోతున్నాయి. ముసలితనం పైబడిందే అని దుఃఖం వచ్చింది," అన్నది కళ్ళ నీళ్ళు తుడుచుకొంటూ.

ఇది విని రాజు, "ఇందుకోసమేనా నీ విచారం! ముసలితనం అందరికీ వస్తుంది. దానితోపాటు మరణం కూడా వెంటాడుతూ వుంటుంది. ఇది సహజమే కద. ఇవాళ కాకపోతే రేపయినా చావవలసిన వాళ్లమే కదా. అందుకోసం విచారించటం అనవసరం," అంటూ సముదాయించాడు.

కాని రాణీకి విచారం తగ్గలేదు. తన భర్తకు ఆయుర్వృద్ధి కలిగించవలసిందంటూ, ఆమె ముక్కోటి దేవతలనూ ప్రార్థించసాగింది. భార్య విచారాన్ని చూసి రాజ్యవర్థనుడు కూడా కుంగిపోసాగాడు. అతడు క్రమక్రమంగా రాజ్యవ్యవహారాలే పట్టించుకొనని దశకు దిగజారిపోయాడు.

ఈ పరిస్థితిలో మంత్రి ఏమి చేస్తే బావుంటుందా అని ఆలోచించాడు. వృద్ధాప్యంతో పాటు, మానసిక ఆరోగ్యాన్ని కూడా కోల్పోతున్న రాజు, పక్కకు తప్పుకోవటమే రాజ్యానికి క్షేమం అనుకున్నాడు. రాజ్యభారాన్ని మోసేందుకు రాజ్యవర్థనుడి పెద్ద కుమారుడు ఉండనే ఉన్నాడు. మంత్రి, రాజుతో ఉన్న పరిస్థితి దాపరికం లేకుండా మనవి చేసుకొన్నాడు.

సరే రాజ్యవర్ధనుడు పెద్ద కొడుకును రాజుగా చేసి, తాను తపస్సు చేసుకునేందుకు అడవులకు వెళ్ళిపోదా మనుకున్నాడు. మరునాడే రాజు పురోహితుణ్ణి పిలిపించి, అందుకుతగిన ముహూర్తం పెట్టమన్నాడు.



కాని, ప్రజలు ఊరుకోలేదు. వాళ్ళు రాజుతో, "ప్రభూ! ఇన్నాళ్ళూ మమ్మల్ని కన్నబిడ్డలలాగా చూస్తూ వచ్చారు. ఈ నాడు మమ్మల్ని వదిలిపెట్టి పోతున్నారంటే మాకు విచారం కలుగుతోంది. మీరు ఇక్కడే ఉండి పొండి. మా మాట కాదు అంటే మేము కూడా మీతో పాటు వస్తున్నాము," అన్నారు ఏక కంఠంగా.

అందుకు రాజు, "మానవుడికి పుట్టుకతోనే చావూ వున్నది. ఎవ్వరైనా చావక మానరు. నేను అడవులలోకి వెళ్ళక పోయినా నన్ను మరణం వెంటాడుతూనే ఉంటుంది. కనుక ఈ ముసలితనంలోనయినా తపస్సు చేసుకుంటూ కాలం గడుపుతాను. మీరేమీ భయపడకండి. మీకు మరో రాజుని నియమించే వెళుతున్నాను గదా," అన్నాడు.

అయినా ప్రజలు ఊరుకోలేదు. వాళ్ళల్లో ముఖ్యులు పుణ్యక్షేత్రాలకు వెళ్లి తమ రాజుకు ఆయువు వృద్ధి కావాలని తపస్సు చేయసాగారు. అలా వాళ్లు నెలల తరబడి తమ రాజు కోసం తపస్సు చేశారు. అప్పుడు వాళ్లకు ఒక గంధర్వుడు కనబడి, "మీరంతా ఆ ప్రత్యక్ష దైవం సూర్య భగవానుణ్ణి గురించి కామరూప పర్వతం మీద తపస్సు చేయండి. ఆయనే మీ కోరిక తీరుస్తాడు," అని చెప్పి అదృశ్యమయ్యాడు.

అందుకు వాళ్ళు సంతోషించి కామరూప పర్వతం మీదకు వెళ్ళి, ఘోరంగా తపస్సు చేయసాగారు. కొంతకాలానికి సూర్యుడు ప్రత్యక్షమై, "మీ కోరిక ప్రకారం రాజ్యవర్ధనుడు ఇంకా వేయి సంవత్సరాలు జీవిస్తాడు," అని చెప్పి అదృశ్యమయ్యాడు.

తపస్సు ఫలించింది గదా అని వాళ్ళు సంతోషించారు. మహారాజుతో ఈ సంగతి చెప్పారు. కాని, రాజుకు సంతోషం కలగలేదు. అది చూచి రాణి, "ప్రజలు మీయందు గల భక్తి విశ్వాసాలతో సూర్యుణ్ణి ప్రార్థించి వరం సంపాదించుకు వచ్చారు కదా! ఇంకా మీకు విచారం ఎందుకు?" అని అడిగింది.

అందుకు రాజు, "నువ్వు చెప్పిన మాట బాగానే వుంది. నా ప్రజలు నా కోసం ఇంత కష్టపడి వరం పొంది వచ్చారు. సరే, నేను వేయి సంవత్సరాల కాలం జీవిస్తాను. కాని, నా మీద విశ్వాసం గల ఈ ప్రజలు అంతకాలమూ జీవించరు కదా? నాతో పాటు నా ప్రజలు కూడా వేయి సంవత్సరాలు జీవించి వుండకపోతే నాకు సంతోషం ఎక్కడిది? కనుక, నేను కూడా నా ప్రజలకు నేను ఉన్నంతకాలమూ ఆయుస్సు సంపాదిస్తాను," అని కామరూప పర్వతం మీదకువెళ్ళి, తపస్సు ప్రారంభించాడు.

ఒకటి రెండు సంవత్సరాలు గడిచినై. రాజ్యవ్యవహారాలు కుంటుపడినై. అయినా ప్రజలు నీతివర్తనులు గనక దేశంలో అరాజకం ప్రబలలేదు. తమ రాజు చేస్తున్న తపస్సు ఎప్పటికి ఫలిస్తుందో గదా అని ప్రజలు ఆతురత చెంద సాగారు. ప్రతి దినం వేలాదిమంది కామరూప పర్వతం దగ్గరకు వెళ్ళి రాజ దర్శనం చేసుకోసాగారు.

ఎట్టకేలకు సూర్యభగవానుడు, రాజ్య వర్ధనుడి దీక్షకు మెచ్చుకున్నాడు. అతనికి ప్రత్యక్షమై, "రాజా! నీ సద్బుద్ధికి మెచ్చాను. నీ తపస్సు ఫలించింది. ఇక నగరానికి వెళ్ళు. నీ కోరిక ప్రకారమే, నీవు జీవించినంతకాలమూ నీ ప్రజలు కూడా జీవిస్తారు," అని వరమిచ్చి అదృశ్యమయ్యాడు.

సూర్యభగవానుడి అనుగ్రహం వల్ల రాజ్యవర్ధనుడూ, అతని ప్రజలూ వేయి సంవత్సరాలు జీవించి సర్వసౌఖ్యాలూ అనుభవించారు.






# విఘ్నేశ్వరుడు

ఒకానొకప్పుడు లక్ష్మి మానససరోవరంలో జలకమాడుతూండగా, పార్వతి విష్ణువు వేషం ధరించి లక్ష్మిని సమీపించింది. నవమోహనంగా కనిపించిన నారాయణుని లక్ష్మి చూచింది. నారాయణుని వేషంలో ఉన్న పార్వతికి కూడా లక్ష్మి సౌందర్యం మనోహరంగా కనిపించింది. ఇద్దరూ సాభిప్రాయంగా చూసుకున్నారు. ఆ చూపుల కలయికలో సరోవరంలో ఒక స్వర్ణకమలం లేచింది. అందులో ధగధగ మెరిసిపోతున్న పసిపాప ఉన్నది.

లక్ష్మి, నారాయణుని దగ్గిరచేరి కౌగలించుకున్నది. పార్వతి పగలబడి నవ్వుతూ, "నేను నారాయణుడిని కాను, లక్ష్మి!" అని నిజరూపంతో కనిపించింది. లక్ష్మి, "అన్నకుతగ్గ చెల్లెలివే, నారాయణి అనిపించుకున్నావులే!" అన్నది.

పార్వతి, "అప్పుడు విష్ణువు మోహినీ రూపంతో శివుణ్ణి మాయబుచ్చినదానికి ఇది చెల్లువేసుకో!" అన్నది.

స్వర్ణకమలంలోని పసిదాన్ని చూసి ఇద్దరూ మురిసిపోయారు. అపార ప్రేమ పుట్టి చేతుల్లోకి తీసుకున్నారు. అప్పుడు విఘ్నేశ్వరుడు వచ్చి, "తల్లులారా! మీ ఇద్దరి అంశలతో అవతరించిన ఈ బిడ్డ పార్వతి పరంగా జయ, లక్ష్మి పరంగా శ్రీ కలిసి జయశ్రీగా పెరుగుతుంది. ఈమెకు వరుడు కూడా శివకేశవుల అంశలతో అవతరించి ఉన్నాడు!" అని చెప్పి, పసిదానితో ఉన్న స్వర్ణకమలాన్ని

11. విఘ్నేశ్వర లీలలు



కావేరీనదిలో ఉంచి రమ్మని వాయుదేవుడికి చెప్పాడు. వాయుదేవు డలాగే జయశ్రీని కావేరినదికి చేర్చాడు.

దక్షిణప్రాంతాన్ని పాలించే చక్రవర్తి స్వర్ణకమలంలో కనిపించిన బాలికను, వరప్రసాదంగా లభించిన పుత్రికగా తీసుకువెళ్ళి, నామకరణ మహోత్సవం జరిపించుతూండగా, ఆకాశవాణి "జయశ్రీ అని పిలవండి!" అని పలికింది. జయశ్రీ రాకుమారిగా పెరిగి ముల్లోకాల్లో అంత సౌందర్యవతి, సాహసవంతురాలు ఉండదనిపించుకొన్నది.

జయశ్రీకి రాజభవనం కంటే ప్రకృతి సౌందర్యంతో నిండి ఉండే అరణ్యాల్లో విహరించడమే యిష్టంగా ఉండేది. విల్లమ్ములు ధరించి, వన్యమృగాలను అదుపులో ఉంచుతూ తిరుగుతూండేది.

హరిహరాంశలతో అవతరించిన స్వామి కైలాసం వెళ్ళి, విఘ్నేశ్వరుణ్ణి, కుమారస్వామిని కలుసుకోవాలని ఎన్నాళ్ళుగానో అనుకుంటున్నాడు. ఒకనాడు అలాగే వెళ్ళాడు, స్వామి. విఘ్నేశ్వరుడు, కుమారస్వామి ఆనందంగా ముచ్చటలాడుతూ, మానససరోవర జలవిహారం చేస్తూండగా, విఘ్నేశ్వరుడు, "ఈ మానససరోవరంలోనే లక్ష్మి పార్వతుల తేజస్సులతో స్వామికి కాబోయే దేవేరి ఉదయించింది!" అని ఊరుకున్నాడు.

స్వామికి కుతూహలం కలిగినా అణుచుకొని, మరి కొంతకాలం అక్కడ గడిపి, వెళ్ళబోతున్నప్పుడు విఘ్నేశ్వరుడు, "స్వామీ! మా కంటే పెద్దవాడివైన నీవు బ్రహ్మచారిగా ఉండటం బాగా లేదు, సత్వరంగా నీకు కళ్యాణం తప్పదు!" అన్నాడు.

కుమారస్వామి, విఘ్నేశ్వరుడు స్వామికి ఘనంగా వీడ్కోలు యిచ్చారు. స్వామి నిజనివాసానికి చేరుకున్నాడు.

ఒకనాడు స్వామి వినోదంగా పెద్దపులి మీద స్వారి చేస్తూ అరణ్యంలో తిరుగుతూండగా, పులిని కదలనివ్వకుండా

మట్టూరా బాణాలు రివురివ్వున నాటు కున్నాయి. స్వామి బాణాలు వచ్చిన దిశగా కోపంగా చూశాడు. కోపం పటా పంచలైంది. విల్లమ్ములతో ఠీవిగా నిల్చుని చిరునవ్వు విసరిన జయశ్రీ కని పించి, స్వామి గుండెలో బాణంలాగ గుచ్చు కొన్నది. స్వామి అంతర్ధానమయ్యాడు.

జయశ్రీకి స్వామిని గురించి విఘ్నేశ్వ రుడు కలలో అదివరకే చెప్పి ఉన్నాడు. అతనికోసమే అరణ్యాల్లో తిరుగుతున్నది.

నారదుడి ఆదేశంతో, చక్రవర్తి జయశ్రీకి స్వయంవరం ఏర్పాటు చేశాడు. రాజాధిరాజులుగా మారు రూపాలతో ఇంద్రాది దేవతలు కూడా వచ్చారు. స్వామి ఒక సాధారణ శబరయువకుడి రూపంతో విల్లమ్ములు ధరించి, పెద్ద నల్లని కుక్కను వెంటబెట్టుకొని వచ్చాడు.

రాజాధిరాజులు ఠీవి ఒలకబోస్తూ శబర యువకుణ్ణీ, అతని పెంపుడు కుక్కనూ ఎకసక్కెం చేశారు.

స్వామి సింహద్వారానికి అడ్డంగా, అందర్నీ కారాగారంలో బందీలు చేసినట్లు కుక్క మీద కూర్చున్నాడు. కుక్క పెద్ద పులిగా మారింది. భయంకరంగా గాండ్రు మన్నది. జయశ్రీ స్వామిని గుర్తించి చరచరావచ్చి వరమాలవేసి వరించింది. స్వామి జయశ్రీని పులి మీద ముందు కూర్చుండబెట్టుకొన్నాడు. దేవతలకు కోపం వచ్చింది. శబరయువకుడి మీద ఒక్కుమ్మడిగా విరుచుకుపడి, ఆయుధాలు





తీశారు. స్వామి విల్లమ్ములు తీసి అందర్నీ ఎదుర్కొన్నాడు.

అతని బాణప్రయోగధాటికి దేవతలు చెల్లాచెదరై, నిజరూపాలతో అస్త్రాలు ప్రయోగించారు. స్వామిని ఎలాంటి అస్త్రమూ తాకలేకపోయింది. ఇంద్రుడి వజ్రాయుధం కూడా పనికిమాలినదైంది. అప్పుడు స్వామి తన నిజరూపంతో హరిహర స్వామిగా సాక్షాత్కరించాడు. దేవతలు చేతులు మోడ్చారు, "శరణం స్వామీ!" అన్నారు.

స్వామి జయశ్రీల కళ్యాణం దేవాది దేవతల మధ్య మహా వైభవంగా జరిగింది. జయశ్రీతో స్వామి నిజనివాసానికి వెళ్లాడు.

త్రేతాయుగంలో ఆర్యావర్తంలో కోసలుడు, కేకయుడు, వసుమిత్రుడు అనే రాజులు ముగ్గురూ ఆప్తమిత్రులుగా ఉండేవారు. కోసలుడికి కౌసల్య, కేకయుడికి కైకేయి, వసుమిత్రుడికి సుమిత్ర అనే కుమార్తెలున్నారు. అయోధ్యను పాలించే దశరథుడికి తమ కుమార్తెలను యిచ్చి పెళ్ళి చేయాలని ముగ్గురు రాజులకూ ఏకాభిప్రాయం కలిగింది దశరథుడు అంగీకరించాడు.

ముగ్గురు రాజులూ జైమినిమహర్షి చేత వివాహానికి లగ్నం పెట్టించారు. జైమిని ముహూర్తం నిర్ణయించి, "నేను పెట్టిన ముహూర్తబలం ఎటువంటిదంటే, విఘ్నేశ్వరుడి సాక్షిగా ఈ ముగ్గురి వివాహం దశరథుడితో జరిగి తీరుతుంది! అయితే, వివాహం జరిగే ముందు రాకుమార్తెలకు రాక్షసగండం కనిపిస్తున్నది. కనుక, ముగ్గుర్నీ జాగ్రత్తగా ఉంచాలి!" అని చెప్పాడు.

ముగ్గురు కన్యలనూ రాజులు ఒక పెద్ద పెట్టెలో భద్రంగా దాచారు.

నారదుడు రావణాసురుడితో, "లంకేశ్వరా! అతి త్వరలోనే దశరథుడికి వివాహం కాబోతున్నది. దశరథుడి కుమారుడు నిన్ను హతమారుస్తాడు!" అని చెప్పాడు.



చూస్తూండగా, నౌకవైపే కొట్టుకొని వస్తున్న పెద్ద పెట్టె కనిపించింది. పెట్టె నౌకను ఢీకొని పైకప్పు ఊడిపోయింది అందులో రాకుమార్తెలు కనిపించారు. తాళ్ళ నిచ్చెనలతో వాళ్ళను నౌక మీదకు రప్పించాక, ఆ ముగ్గురూ తాను వివాహం చేసుకోనున్న పెండ్లికుమార్తెలేనని దశరథుడు తెలుసుకున్నాడు. సరిగ్గా అదే సమయానికి జైమినిమహర్షి ముహూర్తం పెట్టాడు. అప్పుడు అక్కడ విఘ్నేశ్వరుడు ప్రత్యక్షమై, ముగ్గురు రాకుమార్తెలతో దశరథుడి వివాహం జరిపించి, అంతర్ధానమయ్యాడు. ముగ్గురు వధువులతో దశరథుడు ఆనందంగా స్వదేశం చేరుకున్నాడు.

చిరకాలానికి దశరథుడికి నలుగురు కుమారులు పుట్టారు. పెద్దవాడైన రాముడు కైకేయి కారణంగా సీతతో, లక్ష్మణుడితో అరణ్యవాసం వెళ్ళాడు. రావణుడు సీతను ఎత్తుకుపోయి లంకలో పెట్టాడు. రాముడు హనుమంతుడు, సుగ్రీవుడు మొదలైన వానరుల సహకారంతో లంకను ముట్టడించి, రావణసంహారం చేశాడు. సీతతో పుష్పకవిమానంలో బయలుదేరి, వారధి కట్టడం ప్రారంభించిన సముద్ర తీరంలో ఆగి, అక్కడ శివపూజ జరిపి, అయోధ్యకు వెళ్ళాలనుకున్నాడు.

రావణుడు రాకుమార్తెలను ఎత్తుకు రమ్మని మహోదరుడు అనే గొప్ప రాక్షసుణ్ణి పంపాడు. మహోదరుడు కన్యలను పెట్టెలో భద్రపరిచినది కనిపెట్టి, ఆ పెట్టెను మింగేశాడు. వాడు ఆకాశ మార్గంగా సముద్రం మీదుగా లంకకు వెళ్తూండగా, కడుపునొప్పి వచ్చి పెట్టెను కక్కేశాడు. సముద్రంలో పడి పెట్టె కెరటాల మీద కొట్టుకుంటూ పోయింది.

దశరథుడు సముద్రం మీద దూర తీరాలకు వెళ్ళి పెద్ద నౌకలో తిరిగి వస్తున్నాడు. ప్రయాణం ఆలస్యమైంది. అనుకున్ననాటికి చేరలేకపోతున్నందుకు విచారిస్తూ, దశరథుడు సముద్రాన్ని

శివలింగ ప్రతిష్ఠకు తగిన లింగాన్ని తీసుకురమ్మని హనుమంతుడిని కైలాసానికి పంపాడు. హనుమంతుడు మనోవేగంతో కైలాసం చేరుకొని, అక్కడ ఉన్న శివలింగాల్లో పెద్ద లింగాన్ని చూసి రెండు చేతులతో ఎత్తబోయాడు. లింగం కొంచమైనా కదల్లేదు. దానికంటె చిన్న లింగాన్ని తీయబోయాడు, అదీ కదల్లేదు. చివరికి అన్నిటికంటె చిన్న లింగాన్ని కూడా ఎత్తలేకపోయాడు.

కాలం మించిపోతున్నది. తన అసమర్థతకు హనుమంతుడు విచారిస్తుండగా, బుడిబుడి నడకలతో అక్కడికి ఒక పిల్లవాడు వచ్చాడు. "ఎవరయ్యా నీవు? హనుమంతుడి లాగే ఉన్నావు, కాని కావు!" అన్నాడు పిల్లవాడు.

"నేను హనుమంతుడినే! ఒక శివలింగాన్ని తీసుకురమ్మని రాముడు పంపాడు. ఇంతకూ, నీవెవరవోయి, బాలుడా?" అన్నాడు హనుమంతుడు.

"ఇక్కడి లింగాలను ఎవరూ ఎత్తుకుపోకుండా నన్ను కాపలా ఉంచారు గాని, నీవు హనుమంతుడవని చెబుతున్నావు. హనుమంతుడు శివుని అవతారమే అనీ, పంచముఖాంజనేయుడనీ విన్నాను. నీ పంచముఖాలు ఏవీ?" అన్నాడు బాలుడు.



అప్పుడు హనుమంతుడు గరుడ, వరాహ, సింహ, అశ్వముఖాలను కలుపుకొని, పంచముఖాంజనేయుడై, ఉన్నతంగా పెరిగి పిల్లవాడితో నవ్వుతూ, "విఘ్నేశ్వరా! నా వంతు అయింది. పంచముఖ విఘ్నేశ్వర రూపంతో కనిపించడం నీ వంతు!" అన్నాడు.

అప్పుడు బాలుడి రూపంలో ఉన్న విఘ్నేశ్వరుడు, ఐదు తలలతో సమాన ఎత్తున పెరిగి విశ్వరూపంతో కనిపించాడు.

హనుమంతుడు పంచముఖ విఘ్నేశ్వరుడికి నమస్కరించి, "పిల్లవాడి రూపంతో వస్తున్నప్పుడే విఘ్నేశ్వరుడివని గ్రహించాను. శివలింగాలు కదలకుండా

చేసింది నీవేకదా? నీవే ఒక లింగాన్ని ప్రసాదించు!" అన్నాడు.

విఘ్నేశ్వరుడు, "హనుమా! నీ పంచ ముఖ రూపం చూడాలని నేను ఇలా చేశాను. నీవు శివాంశతో పుట్టినవాడవు. నీకు అడ్డేమిటి? అయినా అడిగావు గనక విశేషాంశలు గల లింగాన్ని నీకు యివ్వాలనే, ఎంచి ఉంచాను, తీసుకువెళ్ళు," అని చెబుతూ, హనుమంతుడి దోసిట్లో గొప్పదైన జ్యోతిర్లింగాన్ని ఉంచాడు.

హనుమంతుడు మామూలు రూపంతో దోసిట్లోని లింగాన్ని పదిలంగా పట్టుకొని, రివ్వున ఎగిరి వెళ్లాడు. అప్పటికి కాలాతిక్రమణ జరిగింది.

సమయం మించిపోకుండా సీతాదేవి ఇసుకతో శివలింగాన్ని చేసింది. రాముడు జలాభిషేకం చేసి, పూజకు ఉపక్రమించబోతూండగా, హనుమంతుడు లింగంతో అక్కడ వాలాడు.

హనుమంతుడు జరుగుతున్నది చూసి, తోకతో సైకతలింగాన్ని చుట్టి తీసి వేయబోయాడు. కాని ఇసుకలింగం చెక్కు చెదరలేదు. హనుమంతుడు మరింత తోక గట్టిగా బిగించి లాగితే తోక నొప్పి పెట్టిందే గాని లింగం కదల్లేదు.

అప్పుడు రాముడు హనుమంతుణ్ణి శాంతపరిచి, "హనుమా! బుద్ధిమంతులు కూడా ఒకొక్కప్పుడు పొరపాటు పడుతూంటారు సుమీ! అన్నీ తెలిసినవాడివి, సైకతలింగమైనా, అది శివునికి ఆనవాలు కదా? ఇంతకూ, ఇప్పుడేం మించిపోయింది గనక, నీవు తెచ్చిన లింగాన్ని సైకతలింగం దాపునే ప్రతిష్ఠించి, పూజించి మరీ వెళతాను!" అని చెప్పాడు.

హనుమంతుడు తను తెచ్చిన లింగాన్ని రాముడికి యిచ్చి, లెంపలు వేసుకొని సైకతలింగానికి మ్రొక్కాడు.

రాముడు హనుమంతుడు తెచ్చిన లింగాన్ని ప్రతిష్ఠించి, యథావిధిగా పూజాక్రమం సీతతో కలిసి జరిపిన పిమ్మట, అందరితో పుష్పకం మీద అయోధ్యకు చేరి, పట్టాభిషిక్తుడయ్యాడు.





# గంధర్వ చక్రవర్తి కూతురు

## 2

హసన్ స్పృహ కోల్పోగానే, ''ఇప్పుడు నా నుంచి తప్పించుకుపోలేవురా, బిడ్డా!'' అంటూ వృద్ధుడు తాను కూచున్న చోటు నుంచి లేచి, హసన్ కాళ్ళు మడతపెట్టి రొమ్ముకు బిగగట్టి, అక్కడ వున్న ఒక బట్టలపెట్టె ఖాళీ చేశాడు.

తరవాత ఆ దుర్మార్గుడు హసన్‌ను ఆ పెట్టెలో పెట్టి, ఇంట్లో ఉన్న డబ్బంతా తీసుకుని, బయటికి వెళ్ళి ఒక కూలీని మాట్లాడి తెచ్చి, వాడిచేత పెట్టె మోయించుకుని తిన్నగా రేవుకు వెళ్ళాడు. అక్కడ ఒక ఓడ సిద్ధంగా ఉన్నది. ఓడ సరంగు వృద్ధుణ్ణి చూడగానే పెట్టెతో సహా ఎక్కించుకుని, లంగరు ఎత్తి ఓడను సముద్రం మీదికి నడిపించాడు.

కొంతసేపయాక హసన్ తల్లి ఇంటికి వచ్చి చూసుకుంటే హసన్ లేడు, పెట్టె లేదు. కిందటి రోజు హసన్ బంగారం అమ్మి తెచ్చిన డబ్బు కూడా లేదు. పెట్టెలో ఉండిన బట్టలన్నీ చెల్లాచెదరుగా పడి ఉన్నాయి. బయటి వాకిలి తెరిచి ఉన్నది. ఆమె తల బాదుకుని, తన బట్టలు చించుకుని కొడుకును మళ్ళీ చూడననీ, భయపడినంతా అయిందనీ ఏడ్చింది. ఆమెను ఓదార్చటం ఇరుగు పొరుగు వాళ్ళకు సాధ్యం కాలేదు.

ఆమె తన నట్టింట కొడుకు పేర ఒక చిన్న గోరీ కట్టించి, అహోరాత్రాలు దాని దగ్గిరే కాపలా వుండి ఏడుస్తూ కాలం గడపసాగింది.

హసన్‌ను మాయజేసి పట్టుకుపోయిన పర్షియను ఒక భయంకర మాంత్రికుడు. వాడి పేరు బెహ్రామ్. వాడు తన మాయ విద్యలకు ఎందరో ముస్లిము కుర్రాళ్ళను




బలి ఇచ్చాడు. ఈసారి వాడికి హసన్ దొరికాడు.

సముద్ర ప్రయాణం సాగినన్నాళ్ళూ బ్రహాం హసన్‌ను పెట్టెలోనే ఉంచి మత్తుమందు కలిపిన ఆహారం పెడుతూ వచ్చాడు. కొన్నాళ్ళకు ఓడ అవతలి తీరాన్ని చేరింది. బ్రహాం పెట్టెతో సహా ఒడ్డున దిగాక ఓడ వెళ్ళిపోయింది. అప్పుడు ముసలివాడు హసన్‌ను పెట్టెలో నుంచి పైకి తీసి, కట్లు ఊడదీసి, వాడి మత్తు వదలటానికేవో మందులు వాసన చూపించాడు.

హసన్ కళ్ళు తెరిచి చూసేసరికి తాను సముద్రం ఒడ్డున ఉన్నట్టు తెలిసింది, కాని అది వాళ్ళ దేశం కాదని కూడా తెలిసింది. ఎందుకంటే ఈ సముద్ర తీరాన ఇసుకలో నల్లని, తెల్లని, పచ్చని, ఎర్రని గులకరాళ్ళున్నాయి. వాడు అశ్చర్యంతో లేచి నిలబడగానే వెనకగా ఒక రాతి మీద కూచుని ముసలాడు కనిపించాడు. వాడే తనని మోసం చేసి ఇక్కడికి తెచ్చాడనీ, తల్లి అన్న మాటలు అక్షరాలా నిజమయాయనీ హసన్ గ్రహించాడు.

అతడు ముసలాడి దగ్గిరికి పోయి, "నాయనగారూ, ఇదంతా ఏమిటి? మా ఇంటి ఉప్పు తిన్నారే!" అన్నాడు.

ముసలాడు గట్టిగా నవ్వి, "అగ్నిని పూజించే బ్రహాంకు ఉప్పు తిన్న నిర్బంధమేమిటి? నీవంటి ముస్లిము యువకుల్ని తొమ్మిదివందల తొంభైతొమ్మిదిమందిని బలి ఇచ్చాను. నువు వెయ్యోవాడివి. నా చేతిలో చిక్కావు. తప్పించుకోలేవు. నీ దేవుణ్ణి విడిచిపుచ్చి నా లాగా నువ్వు కూడా అగ్నిని అర్చించు," అన్నాడు.

ఆ మాటలకు మండిపోయి, "నీచుడా, ఏమిటి నువ్వనేది?" అని హసన్ గట్టిగా అరిచాడు.

వెంటనే బ్రహాం తన వాలకం మార్చేసి, "నిన్ను పరీక్షించటానికలా అన్నాను, నాయనా! భేష్, పరీక్షలో నెగ్గావు. ఏకాంత ప్రదేశంలో నీకు నా విద్య

చెబుదామనే ఉద్దేశంతోనే ఇక్కడికి తెచ్చాను. అదుగో ఆ కనబడే కొండో చూశావా? దాని శిఖరం మబ్బులకన్న ఎత్తుగా ఉంది. అందుచేత దాన్ని మబ్బుల కొండ అంటారు. మనకు కావలిసిన మూలికలన్నీ దాని మీద ఉన్నాయి. మనం ఇప్పుడక్కడికి ఎక్కాలి,'' అన్నాడు.



హసన్ అనుమానం కొంత తగ్గింది. అతను బ్రెహ్రాంను, ''ఆ కొండ గోడలాగా ఉందే, దాని శిఖరానికి ఎలా ఎక్కటం?'' అని ప్రశ్నించాడు.

''మనకు ఎక్కవలిసిన పనే లేదు. పక్షుల్లాగా వెళ్ళి అక్కడ వాలుదాం,'' అంటూ బ్రెహ్రాం తన పైబట్ట లోపలి నుంచి ఒక రాగితప్పెట తీశాడు.

దానిపైన కోడిపుంజు చర్మం పరిచి ఉన్నది. ఆ చర్మం మీద ఏవో బీజాక్షరాలు రాసి ఉన్నాయి.

బ్రెహ్రాం ఆ తప్పెట మీద వేళ్ళతో వాయించగానే పెద్ద ఎత్తున ధూళి లేచి, అది లేచినచోట ఒక నల్లని రెక్కల గుర్రం ప్రత్యక్షమయింది. దాని ముక్కు నుంచి జ్వాలలు వెలువడుతున్నాయి. బ్రెహ్రాం దాని పైన ఎక్కి కూచుని, హసన్‌కు సహాయం చేసి తన వెనక ఎక్కించుకున్నాడు. వెంటనే ఆ గుర్రం రెక్కలాడించి, రివ్వున గాలిలోకి లేచి, కనురెప్పపాటు కాలంలో మబ్బుల కొండ శిఖరం మీద వాలింది. తరవాత బ్రెహ్రాం, హసన్ లిద్దరూ కిందికి దిగగానే అదృశ్యమై పోయింది.

హసన్ అనుమానాలు తిరిగి వచ్చాయి. వాడు చుట్టూ కలయజూస్తే ఏ విధమైన మూలికలూ లేవు. బ్రెహ్రాం వాడితో, ''ఇప్పుడు నిన్ను ఏ ప్రాణీ రక్షించలేదు! నా నుంచి ఎలా తప్పించుకుంటావు?'' అని బిగ్గరగా నవ్వాడు.

హసన్‌కు పట్టరాని ఆగ్రహం పచ్చేసింది. ''నీచుడా, నాకు అల్లా అండ ఉన్నది. చూడు అల్లా సహాయంతో నిన్నెం



చేస్తానో!'' అంటూ ఒక చేత్తో ముసలాడి చేతిలో ఉన్న రాగితప్పెట లాగేసి, రెండో చేత్తో బలంకొద్దీ అతణ్ణి కొండ మీది నుంచి తోసేశాడు. బెహ్రాం గాలిలో పిల్లిమొగ్గలు తిరుగుతూ, ప్రాణభయంతో అరుస్తూ కిందపడి రాళ్ళ మీద పచ్చడి అయిపోయాడు.

ఆ మాంత్రికుడికి భూమి మీద నూకలు చెల్లిపోయాయి.

హసన్ దుర్మరణం నుంచి తప్పించుకోవడమే గాక తన శత్రువైన బెహ్రాంను కూడా తుదముట్టించి విముక్తుడయాడు. అతను తన చేతిలో ఉన్న తప్పెటను తిప్పి తిప్పి చూశాడు, కాని దాన్ని ఎలా ఉపయోగించేదీ తెలుసుకోలేక, చేతగాక ఏం చేస్తే ఏం జరుగుతుందోనని సంశయించి, దానిని తన రొండిన కట్టుకుని, చుట్టూ ఒకసారి కలయజూశాడు.

అతనున్న కొండ శిఖరం మబ్బులకన్న ఎత్తుగా ఉన్నప్పటికీ, ఆ ప్రాంతం చాలా విశాలమైన సమ ప్రదేశంగా ఉన్నది. ఎక్కడా ఒక చెట్టుగాని, పొదగాని లేదు; బ్రహ్మాండమైన రాతి మైదానం. ఈ మైదానం ఒక చివర హసన్ ఉన్నాడు. దాని రెండో చివర అతనికి మంటలు ప్రకాశిస్తున్నట్టు కనిపించింది. మనిషి లేనిచోట మంట లుండవనుకుంటూ హసన్ వేగంగా ఆ మంటలకేసి నడవనారంభించాడు.

అతను దగ్గిరికి వచ్చినకొద్దీ ఆ మంటలు ఒక పెద్ద భవనంగా మారాయి. ఆ భవనానికి నాలుగు బ్రహ్మాండమైన స్తంభాలున్నాయి. వాటిపైన ఒక గుండ్రని గుమ్మటం ఉన్నది. స్తంభాలకూ, గుమ్మటానికీ, భవనానికీ బంగారు రేకు తొడిగి ఉన్నది. సూర్యకాంతి ఈ బంగారు భవనం పైన పడటంచేత హసన్ మంటలు కనిపించాయని భ్రమపడ్డాడు.

హసన్ మానసికంగానూ, శారీరకంగానూ బాగా బడలి ఉన్నాడు. ''ఈ భవనం మనుషులుండేది కాడు. ఏ

యక్షులో; గంధర్వులో ఉండేది. అయితే అయింది. ద్వారపాలకుణ్ణి వేడుకుని మంచినీరడుగుతాను, ఏ మూలనన్నా నడుం వాల్చనిస్తే నిద్రపోతాను,'' అనుకుంటూ హసన్, పచ్చరాతిలో మలిచిన ద్వారం కుండా భవన ప్రాంగణంలోకి అడుగుపెట్టాడు.

అతను కొద్ది అడుగులు నడిచాడోలేదో, ఇద్దరు కన్యలు ఒక చలవరాతి బల్లమీద కూచుని చదరంగం ఆడుతూ కనిపించారు. మొదట వాళ్ళు హసన్‌ను చూడలేదుగాని, కొంతసేపటికి వారిలో చిన్నది తల ఎత్తి, తమ సమీపాన నిలబడి ఉన్న యువకుణ్ణి చూసి, ''అక్కా, ఎవరో అబ్బాయి వచ్చాడు చూడు. దుర్మార్గుడు బెహ్రాం ఏటా ఇలాటి యువకుల్ని మబ్బుల కొండపైకి తెస్తూంటాడు. ఈ అబ్బాయిని కూడా వాడే తెచ్చాడేమో! అలా అయితే ఇతను ఆ మాయదారి వాడి నుంచి ఎలా తప్పించుకుని ఉంటాడు? చాలా ఆశ్చర్యం,'' అన్నది.

హసన్ ఆమె కాళ్ళపై బడి, ''అమ్మా, నేను అలాటి అభాగ్యుణ్ణే!'' అంటూ కంట తడి పెట్టుకున్నాడు. అతని దుస్థితి అర్థమై ఆమెకు హసన్ పైన ఎక్కడలేని జాలీ పుట్టుకొచ్చింది.

ఆమె తన అక్కతో, ''అక్కా, నేనీ కుర్రవాణ్ణి నా తమ్ముడుగా పెంచుకోబోతున్నాను. అందుకు నీవే సాక్షి,'' అన్నధి.

తరవాత ఆమె హసన్‌ను భవనంలోకి తీసుకుపోయి, సుఖంగా స్నానం చేయించి, అతని పాత దుస్తులు అవతల పారేయించి, మంచి దుస్తులు కట్టబెట్టింది.

ఆ తరవాత ఆ అక్కచెల్లెళ్ళు హసన్‌ను తమ మధ్య కూచోబెట్టుకుని భోజనం చేయించారు.

ఈ తతంగమంతా ముగిసినాక హసన్ వారితో, ''అక్కలారా, నాకు మీరు తటస్థపడే అదృష్టం కలగక పూర్వం నేను చాలా కష్టాలు పడ్డాను,'' అంటూ తన కథ యావత్తూ చెప్పాడు.

—(ఇంకా వుంది)



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1982 జనవరి నెల సంచికలో ప్రకటింపబడును.







Ravindra S. Kamboj — M. Natarajan

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ నవంబరు నెల 20 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరవాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/—లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26

---

## సెప్టెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : తాతయ్య సన్నిధి

రెండవ ఫోటో : అదే నాకు పెన్నిధి

పంపినవారు : నలబోలు పీటర్ సైమ్మల్స్, విజయువాడ-6

బహుమతి మొత్తం రు. 25/—నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.




# ఇదిగో!
# పెప్పర్‌మెంట్ రుచి కలిగిన ఒక చాక్‌లెట్ బిస్కట్

స్క్రంచ్

## కరకర తినే చక్కని తినుబండారం

భారతదేశంలో ఈ రకం రెండు రుచుల తియ్యని తినుబండారం ఇదే మొదటిసారి—చాక్‌లెట్ మరియు మింట్ కలసినది, మృదువయినది, రుచికరమైనది, ఎక్కువ చాక్‌లెట్ క్రీమ్‌తో వున్నది—గోధుమవన్నె గల కరకరలాడే రెండు అందమైన బిస్కట్ల మధ్యవున్న పెప్పర్‌మెంట్ రుచిగల చాక్‌లెట్. ఇటువంటి దానిని మీరు యింతవరకు ఎప్పుడు రుచి చూడలేదు. ఇప్పుడే ఒక్క ప్యాకెట్ బిస్కట్ తీసుకోండి. కరకర నములుతూ తినండి, స్క్రంచ్...స్క్రంచ్...స్క్రంచ్...





స్క్రంచ్ కరకర తినే చక్కని తినుబండారం

ట్రూ బిస్కట్లు తయారుచేసేవారు అందచేస్తున్న సరిక్రొత్త తినుబండారం

HTM-AFL-2345

రామ్, శ్యామ్

# వెండి చారలు

ఇంటర్వెల్‌లో రావాల్సింది హుషారుకాని, కడుపునొప్పి కాదు.




























everest/81/PP/103-tl.

పార్లే పాపిన్స్ మజాగా నోట్లో వేసుకునే ముందర వెండిచారలకోసంచూడండి.
ఇప్పుడు నకిలీచేసేవాళ్ళు మిమ్మల్నిమోసం చేయలేరిక.